Regd No. N. 45 / M 3513

వెల ఒక అణా

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ శు॥ ౩ (౨-౧౦-౧౩౪౯ఫ.) సోమవారము సంచిక ౧౯

★ బ్రిటను, ఫ్రాన్సుల నౌకలపోరాటము ★

రుమేనియా, హంగరీ, బల్గేరియాలు జర్మనీకి అనుకూల పగుట

# బ్రిటనుతో ఫ్రాన్సు సంబంధము తెంచుకొనుట

## బ్రిటను—జర్మనీల పోరాటములు

బ్రిటను జర్మనీల పోరాటములనుగూర్చి జూను ౩౦వ తేదినుండి జూలై ౬వ తేదివరకు వచ్చినవార్తలలో ఒకరొకరి విమానాలు ఒకరిదేశములపైకి పోయి బాంబులువేయుటయే ముఖ్యమైన వార్తగానున్నది.

### జర్మనులదాడులు

జూను ౩౦వ తేదిరాత్రి జర్మను విమానములు బ్రిటనుమీదికిపోయి వేల్సు దక్షిణభాగముపైనను తూర్పు సముద్రతీరమువద్దను బాంబులువేసెను ఇంగ్లాండు ఈశాన్యదిగ్భాగమందు బ్రిటీషువారి విమానములచే రెండు జర్మనుబాంబరువకపు విమానములు సముద్రములో కూల్చబడెను.

జూలై ౧వ తేది ఉదయము ఇంగ్లాండు ఈశాన్య సముద్రతీరమునకావల బ్రిటీషువారి పోరాటపు విమానాలు ఒక జర్మనువిమానమును సముద్రములోకి కూల్చెను. ఈరోజు సాయంకాలము ఇంగ్లాండు ఈశాన్య దిగ్భాగముపైకి జర్మను విమానాలు పోయి మంటలనంటించు బాంబులనేకములను వేసినవి. ఇట్టివిమానాలలో రెండు క్రింద కూల్చబడినవి. ఈబాంబులచే స్కాట్లెండు ఈశాన్య సముద్రతీరమందలి ఒకపట్టణములో ౯ మంది మరణించిరి. ౨౦మంది గాయపడిరి. ఇదే రోజు అర్థరాత్రి జర్మనువిమానములు నైఋతి మూలభాగమున ఎగిరి, బ్రిస్టల్ కాలువ ప్రదేశముపై బాంబులువేసెను.

జూలై ౨వ తేది సాయంకాలము మరల జర్మను విమానాలు బ్రిటను ఈశాన్య, నైఋతి దిగ్భాగముపైకిపోయి బాంబులువేసెను. ౧౨ మంది మరణించిరి ౧౨౩ మంది గాయపడిరి. చాలమంది యిండ్లుపాడయ్యెను. వేల్సులోకూడా బాంబులు వేయబడెనని అధికారులనుచున్నారు.

జూలై ౩వ తేది ఉదయము బ్రిటను ఆగ్నేయదిగ్భాగముపై జర్మను విమానాలు బాంబులువేసెను. ఈరోజు ఒక జర్మను విమానము క్రిందకూల్చబడెను ఈరోజుసాయంకాలము మరి రెండు జర్మను విమానాలను బ్రిటీషువారు క్రిందికికూల్చిరి. ఈరోజుపగలు మొత్తము ఇంగ్లాండు, స్కాట్లెండులపై ఎగిరిన జర్మనువిమానాలనుండి అయిదింటిని బ్రిటీషువారు క్రిందికికూల్చిరి.

జూలై ౪వ తేదివాడు జర్మనువిమానాలు ఇంగ్లీషు ఛానల్ అను సముద్రభాగముపైకివచ్చి పోర్టులెండులో ఒకయుద్ధనౌకకు చెందిన ఓడను మంటపెట్టెను. ఇట్లే బ్రిటీషువారి ఒక చిన్నటగ్గు, ఒక లైటరు ముంచివేయబడెను. బ్రిటను నైఋతి దిగ్భాగంలో బాంబులువేయబడెను. ఒకజర్మను విమానము క్రిందకూల్చబడెను. ఈరోజుసాయంకాలము ఇంగ్లాండు ఆగ్నేయ దిగ్భాగముపైకివచ్చిన జర్మను విమానాలలో ఒకదానిని బ్రిటీషు పోరాటపు విమానాలు క్రిందకూల్చెను. ఈరోజు రాత్రిమరల జర్మనువిమానాలు ఇంగ్లాండు మీదికి దాడిజేసెను ఈశాన్యభాగముపైనను, దక్షిణభాగముపైనను బాంబులువేసెను. దక్షిణభాగములో ఒకజర్మను విమానము క్రిందకూల్చబడెను.

జూలై ౫వ తేదినాడు ఉదయము ఒకజర్మను విమానమును ఇంగ్లాండు ఆగ్నేయభాగములో బ్రిటీషువారు క్రిందకూల్చిరి. ఈరోజు ఇంగ్లాండు దక్షిణదిశపైగూడ జర్మనువిమానములు బాంబులువేసెను. ఈనాటిరాత్రి మరల జర్మనువిమానము ఇంగ్లాండు నైఋతిభాగముపై బాంబులువేసెను.

జూలై ౬వ తేది ఉదయము జర్మనువిమానాలు ఇంగ్లాండు ఆగ్నేయభాగముపైబాంబులువేసెను.

### బ్రిటీషువిమానాల దాడులు

బ్రిటీషువిమానాలకూడ జర్మనీ, జర్మనీవారి క్రిందనుండు హాలెండు, ఫ్రాన్సులపైకిపోయి ...

## ఫ్రాన్సు నౌకలతో బ్రిటిషునౌకల పోరాటము

### బ్రిటనులో ఫ్రెంచిరాయబారి రాజీనామా

జూను ౩౦వ తేదినుండి జూలై ౬వ తేదివరకువచ్చినవార్తలలో చాలముఖ్యమైన సమాచారమొకటి ఏమనగా ఫ్రెంచిప్రభుత్వమువారు బ్రిటనుతో సంబంధమును తెంచుకొనుటయైయున్నది. ఇందుకు దారితీసిన సంఘటనలు చాల చిత్రముగానున్నవి

ఫ్రెంచిప్రభుత్వమువారికి ౮ యుద్ధనౌకలు, ౭ పెద్దక్రూయిజర్లు, ౬౩ డిస్ట్రాయర్లు, ఒక విమానాల నౌకయునుగలవు. ఈనౌకలలో కొన్ని ఫ్రెంచిరేవులలోను, కొన్ని బ్రిటీషు రేవులలోను, మరికొన్ని ఫ్రెంచి సామంత రాజ్యాలలోనుఉన్నవి. వీటిసన్నిటిని ఫ్రెంచి రేవులకు రప్పించి నిరాయుధముగ చేయవలెనని జర్మనీవారు ఫ్రెంచివారికి విధించినషరతులలో నొకటి గదా! బ్రిటీషువారు అవిధముగ ఓడలను జర్మనీవారి చేతులలో గాని ఇటలీవారి చేతులలో పడకుండచేయుటకై ఫ్రాన్సు యుద్ధ విరమణమునకై ఆలోచించు నప్పటినుండియు ప్రయత్నించుచుండిరి. తుదకు జూలై ౩వ తేదినాడు బ్రిటీషురేవులలోనున్న ఫ్రెంచినౌకల నన్నిటిని తమ వశములోనికి తీసికొనిరి. రెండుయుద్ధనౌకలు. రెండు సబ్మెరైనులు, మందుగనులను తీయునట్టియు. విమానాలను పడగొట్టునట్టియు రెండువందల ఓడలును ఇట్లు పట్టుకొనబడెను. “సర్కోఫ్” అను పెద్ద సబ్మెరైను అధికారి సుళువుగా లొంగనందువల్ల పోరాటము జరుగుటలో ఒక బ్రిటీషు నావికుడు, ఇద్దరు బ్రిటీషు అధికారులు, ఒక ఫ్రెంచిఅధికారి మరణించిరి.

మధ్యధరా సముద్రమందలి అలెగ్జాండ్రియా రేవులో ఒక ఫ్రెంచియుద్ధనౌక నాలుగు ఫ్రెంచిక్రూయిజర్లు మూడు తుపాకుల నౌకలు ఉండెను. వీటిని ఆరేవునుండి కదలరాదని బిటిషు నౌకాధికారులు కట్టుదిట్టములు చేసినారు.

ఉత్తరఆఫ్రికా సముద్రతీరమునందు మొరాకో ప్రాంతములో ఓరాను మెర్సెల్కెబీరుల ద్ద రెండు ఫ్రెంచిక్రూయిజర్లు, రెండు యుద్ధ నౌకలు, ఇంకను అనేకములైన తేలికక్రూయిజర్లు, డిస్ట్రాయర్లు, సబ్మెరైనులు ఉన్నవి, జూలై౩వ తేదినాడు బ్రిటీషువారు ఒక డిస్ట్రాయరుతోటి కెప్టెన్ హాలెండును ఆనౌకలను జర్మనులవశము కాకుండ ఏర్పాటుచేయుటకై పంపినారు. వారు మూడు షరతులను తెలిపినారు. ఒకటి బ్రిటీషు నౌకలతోకూడచేరి యుద్ధముసాగించుట; రెండు నావికులను తగ్గించుకొని బ్రిటీషురేవుచేరుట. ఇట్లు చేసినచో యుద్ధానంతరము ఫ్రెంచివారి ఓడలను ఫ్రెంచివారికిత్తురు, ఈలోగా అవిచెడినచో పూర్తి నష్టపరిహారమిత్తురు. మూడవది జర్మనీపై గాని ఇటలీపై గాని యుద్ధములో ఫ్రెంచిఓడలను ఉపయోగించరాదనుచో, వెస్టిండీసులో యేరేవుకేని, లేదా అమెరికాకేకాని పోయి అక్కడ యుద్ధాంతమువరకుండుట. ఈమూడింటికి అంగీకరించనిచో ఫ్రెంచిఓడలను నాశనముచేయవలెను. లేదా అవి జర్మనీవశము కాకుండుటకై బ్రిటీషువారే తగినచర్యనైగొందురు.

ఈ షరతులకు ఫ్రెంచినౌకాధికారి అంగీకరించనందున సాయంకాలము యుద్ధముజరిగెను. అందులో ఒక ఫ్రెంచి మేయిజరు దెబ్బతినిగట్టు చేరుకొనెను, ఒక ఫ్రెంచియుద్ధనౌక ముంచబడెను. ఇంకొక యుద్ధనౌక పాడయ్యెను రెండు ఫ్రెంచిడిస్ట్రాయర్లు, ఒక సముద్రవిమానములనౌక ముంచబడెను. ఈ గడబిడలో ఒక ఫ్రెంచి క్రూయిజరుమరికొన్ని ఫ్రెంచినౌకల సాహాయ్యముతో టూలోను రేవుచేరుకొనెను. అక్కడజర్మనులకు వశముకావలెనని యత్నము.

ఈవిధముగా ఫ్రాన్సునౌకలు జర్మనులకు వశముకాబోవుయత్నములో యుద్ధముల నెదుర్కొనవలసివచ్చుటవల్ల ఫ్రెంచినౌకలనుండి ఆయుధములను తీసివేయవలెనను నిర్బంధము సడ...

## జాతీయ గ్రంధములు

| | |
|---|---|
| హైందవ ధర్మవీరులు | ౦-౬-౦ |
| పారసిక స్వత్వములు | ౦-౫-౦ |
| కమాల్ పాషా జీవితము (రెండు భాగములు) | ౦-౧౨-౦ |
| ప్రజలు—ప్రభుత్వము | ౦-౬-౦ |
| ఔంధు సంస్థానము | ౦-౫-౦ |
| కాంగ్రెసు-సంస్థానములు | ౦-౬-౦ |
| సంస్థానసమస్యలు | ౦-౬-౦ |

సభ్యులకు ప్రత్యేక వెల

వార్షికమూల్యము రు ౧-౮-౦లు

దేశోద్ధారక గ్రంధమాల

సికింద్రాబాదు.

## అమెరికా బ్రిటనులకు రహస్యపు ఒడంబడిక

టోకియో, జూలై ౩

బర్మా హాంగుకాంగులనుండి యుద్ధసామగ్రి చైనాకు పంపకుండునట్లు తగు కట్టుదిట్టములను గావింపవలయునని కోరుచు జపానుప్రభుత్వమువారు బ్రిటనుకొక సందేశమంపియుండిరి. ఇంతవరకు బ్రిటిష్ప్రభుత్వమువారీ సందేశమునకు ప్రత్యుత్తరమంపకుండుటను గురించి “అసాహి షింబను” పత్రిక ఇట్లువ్రాసినది:

“స్త్రీలను బిడ్డలను హాంగుకాంగునుండి బ్రిటిషు అధికారులు పంపివేయుచున్నారు. దీనినిబట్టిచూడ జపానుకోరికను తృప్తికరముగ ప్రత్యుత్తరమొసగ బ్రిటను సిద్ధముగ లేదని స్పష్టమగుచున్నది. పసిఫికుసముద్రమున అమెరికా బ్రిటను యుద్ధనౌకలుకలిసి పనిచేయుటకు బ్రిటను అమెరికా ప్రభుత్వములు ఒకరహస్యపు టొడంబడిక గావించుకొనుచున్నవి. ఆవిషయమై అమెరికా బ్రిటనులు సంప్రదింపులు జరుపుచున్నందునవే జపానుకోరికకు ఇంతవరకు బ్రిటను ప్రత్యుత్తరమంపలేదు.

అమెరికా బ్రిటను ప్రభుత్వములు గావించుకొననున్న రహస్యపు టొడంబడికవిషయమై కొకుమినుషింబను పత్రిక యీ క్రిందివివరములను తెలుపుచున్నది:

పసిఫికుసముద్రములో క్లిష్టమగు అంతర్జాతీయ పరిస్థితులేర్పడిన బ్రిటను, అమెరికా యుద్ధనౌకలు కలసిపనిచేయును. హాంగుకాంగు అమెరికావశమునకుంచబడును. హాంగుకాంగు, సింగపూరు, హానలూలు రేవులు. సోలండుకు చేరిన అలాస్కా రేవులను బ్రిటను యుద్ధనౌకలతోపాటు అమెరికా యుద్ధనౌకలుకూడ కేంద్రములుగ ఉపయోగించుకొనును.”

### జపాను అధికారి ప్రకటన

బ్రిటను అమెరికాల రహస్యపు టొడంబడిక గురించి పత్రికాప్రతినిధులు విదేశాంగ శాఖాధికారిని ప్రశ్నింప ఈవిషయమై ప్రభుత్వమువారికి ...

... లించుటకు జపానుప్రభుత్వము సిద్ధపడినట్లు తెలిసినది.

జూలై ౪వ తేదినాడు ఫ్రెంచిమంత్రివర్గము సమావేశమై బ్రిటీషు యుద్ధనౌకలు అకారణముగ పోరాటమునకు ఫ్రెంచినౌకలపైకి వచ్చుటచే బ్రిటనుతో సంబంధము తెంచుకొనుటకు నిశ్చయించెను. ఈ నిర్ణయమును రేడియోలో ఫ్రెంచివిదేశాంగమంత్రి బెడోయిను గారు జూలై ౬వ తేది ప్రకటించి ఫ్రెంచినౌకలను తమవశముచేయవలెనని జర్మను కోరనందున బ్రిటీషువారు ఇట్లుచేసిరేయని ఆక్షేపించిరి. దీనికి బ్రిటీషుఅధికారులు సమాధానముగ ఒక ప్రకటనచేయుచు బేడోయినుగారిప్రకటన జర్మను ఇటలీప్రభుత్వముల అనుమతిలేనిది చేయబడజాలదు కావున, అదినిజమైన ఫ్రెంచిప్రభుత్వప్రకటన కాదనిరి.

బ్రిటీషు చర్యను అమెరికా అధికారులు మెచ్చుకొనుచున్నారు.

ఈలోగా ప్రభుత్వఆక్షేపణను లండనుఫ్రెంచి ప్రతినిధి బ్రిటీషు విదేశాంగ మంత్రికి తెలిపినారు. వారురాజీనామానుకూడ తమ ప్రభుత్వాని కంపజేసిరావ రిస్థానములో కాసెలానిగారు ఉద్యోగము స్వీకరించిరి.

ఫ్రెంచివారి యుద్ధనౌకాధికారి డార్లన్ గారు జర్మనులకు లొంగవద్దని ఫ్రెంచినౌకలకు రహస్యాజ్ఞ పంపినట్లు తెలియుచున్నది

ఫ్రాన్సుకు దూరంగానున్న ఫ్రెంచిఓడలకు వైస్అడ్మిరల్ యమిల్ మ్యూజిలియర్ గారు అధికారిగా జనరల్ డీగాల్ గారిచే నియోగింపబడినారు.

## మైసూరు ఎన్నికలు ఆపగోరుట

### యుద్ధకారణము

బెంగుళూరు, జూలై ౩

అంతర్జాతీయ పరిస్థితి బాగుపడువరకు క్రొత్త సంస్కరణముల ప్రకారము శాసన సభకు, ప్రతినిధిసభకు ఎన్నికలు వాయిదా వేయవలసినదని ప్రభుత్వమునకు సిఫారసుచేయుచు మైసూరు శాసనసభ ఒక తీర్మానమును నేడు సాయంత్రము చేసినది.

కొంత చర్చతర్వాత తీర్మానము వోటుకు పెట్టబడినది. అధికార సభ్యులే పాల్గొనిరి. ౧౬ మంది అనుకూలముగాను, ఇద్దరు ప్రతికూలముగా వోటుచేసిరి.

మైసూరు కాంగ్రెసు అధ్యక్షుడుగా నుండిన దానప్పగారిపేరు న్యాయవాది పట్టికనుండి తొలగించవలసినదని ప్రధాన న్యాయమూర్తి చేసిన ఉత్తరవును చట్టించుటకు తెచ్చిన అడ్జర్న్మెంటు ప్రతిపాదనను అధ్యక్షుడు త్రోసివేసెను.

— —

... అధికారరీత్యా ఎట్టివర్తమానము రాలేదని వారు సమాధానము చెప్పిరి.

### లండను అధికారుల ప్రకటన

బ్రిటను అమెరికాశాఖలు కలసి పనిచేయు విషయమై ఉభయప్రభుత్వములు రహస్యపు టొడంబడిక గావించుకొనినవని టోకియో పత్రికలు గావించిన ప్రకటనలు కేవలము నిరాధారములైనవనియు, ఇట్టిఒడంబడిక జరుగలేదనియు బ్రిటీషు అధికారులు తెలుపుచున్నారు.

### వాషింగుటను అభిప్రాయము

పసిఫికు సముద్రమున అమెరికావారు అనుసరింపగల విధానముగురించి జపాను అధికారులు ఆందోళనపడుచున్నారనియు బ్రిటను అమెరికాలకు రహస్యపుటొడంబడిక కుదిరినదని టోకియో పత్రికలు గావించుచున్న ప్రకటనలకు అందోళనమే కారణమనియు వాషింగుటను ప్రముఖులు అభిప్రాయము తెలుపుచున్నారు. ఈవార్తలు కేవలము నిరాధారమైనవని అమెరికా ప్రభుత్వాధికారులు తెలుపుచున్నారు.

### బట్లరుగారి ప్రకటన

బర్మా హాంకాంగులమీదుగ చైనాకు యుద్ధసామగ్రి పోకుండునట్లు చేయవలయునని జపాను ప్రభుత్వమువారు పంపినసందేశమువిషయమై కామను సభలో ఒక సభ్యుడు అడిగినప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచు జపానుకోరికలను బ్రిటీషుప్రభుత్వమువారు శ్రద్ధతో పరిశీలించుచున్నారని బట్లరుగారుచెప్పిరి. జపానుకోరిక బ్రిటను అంగీకరించినచో బ్రిటీషుప్రభుత్వముపట్ల అమెరికావారికి ఒకవిధమగు చెడుఅభిప్రాయమేర్పడునని మరియొక సభ్యుడు సూచించెను. ప్రత్యుత్తరము పంపునపుడు సభ్యుడు గావించినసూచన దృష్టియందుంచుకొనబడునని బట్లరుగారు సమాధానముచెప్పిరి.

### హాంగుకాంగుప్రజలు మనిలా చేరుట

౧౦ దినములలో హాంగుకాంగునుండి ౯ వేలమంది ఫిలిప్పైనుదీవులలోని మానిల్లాకుచేర్చబడెను వీరిలో మొనటిబట్టు ౧౮౪౦ మంది నేటిదినముస్టీమరులో మనిలాచేరుచేరిరి. వీరిలో పెక్కుమంది బ్రిటీషువారలున్నారు. వారివారికి ప్రత్యేకింపబడినస్థలములకు పంపబడిరి. సరకుల ధరలనుపెంచి లాభములను పొందుటకై ప్రయత్నింపకూడదని ఫిలిప్పైనుదీవులఅధ్యక్షుడు వర్తకులను హెచ్చరించుచు ఒకప్రకటన గావించెను.

# యుద్ధానికి హైద్రాబాదు రాష్ట్రము సహాయము చేయవలెను

## రెసిడెంటు బహాదరుగారును, ప్రధానమంత్రిగారును సంయుక్త ప్రకటన గావించుట

౫ జూలైనాడు గౌ॥ రెసిడెంటుగారును గ్ర. ఆ. సర్ అక్బర్ హైదరీగారును ఈక్రిందివిధముగా ప్రకటన గావించియున్నారు.

"ఈక్లిష్టసమయములో ఇండియాలోని అన్ని ప్రాంతాలనుండియు సామ్రాజ్యభాగాలనుండియు సహాయము విరివిగా జరుగుచుండుటచూచి మాకు చాలా ఆనందముకలిగినది. మీలో చాలామందికిట్టిసహాయము చేయుటకు చాలా అభిలాషకలదనియు మాకోరికకు మీరువెంటనేస్వాగతమిత్తురనియు మాకుతెలియును. ఈసమయములో ఇంగ్లాండుదేశానికి విమానాలు— ఇంకా ఎక్కువవిమానాలు—చాలా అవసరముగా నున్నవి. ఇండియా భావిదశ బ్రిటనుతో లంకెవేయబడియున్నది. మనకందరికిని సంబంధించిన యుద్ధములో ఇతరులు పోరాడుచుండగా మనము నిస్పృహతో నుండజాలము.

ఈరాష్ట్రప్రభుత్వమువారు తమవిధిని నెరవేర్చుచున్నారు. ప్రభుత్వమువారు ౨౦ లక్షలచందా యిచ్చియున్నారు, వాటితో విమానాలు సిద్ధముచేసినారు. అవి శత్రువుతో యుద్ధముచేయుచున్నవి. అయితే మాలోచాలామంది యీ సహాయముచాలదని అభిప్రాయపడుచున్నాము జనుల సహాయముకూడా కావలెనని తలచుచున్నాము. ముఖువ. ప్రభువుగారి అనుమతితో వారిపోషకత్వములో అనేకజనుల కోరికననుసరించి హైద్రాబాదు సికింద్రాబాదు పౌరులపక్షాన "హైద్రాబాదు హరికేన్‌ఫండు" అనుపేరుతో ద్రవ్యనిధి ఏర్పాటుచేయుచున్నాము. హరికేన్‌తరగతికిచేరిన యుద్ధవిమానమునకు ౩లక్షలకు తక్కువపట్టును. అది తక్షణమే ఉపయోగములోనికి రావలెను. వైమానికయోధముగా సంజ్ఞయైనవెంటనే విమానాల నడుపుకొని యుద్ధములోనికి పోదురో అదేఅతురతతో జనులను మాకోరికను వెంటనే పూరింతురని అభిలషించుచున్నాము.

చందాలన్నియు నిజాంప్రభుత్వ ఆర్థిక కార్యదర్శియగు లియాఖతుల్లాఖాన్ ఫైనాన్సుకచ్చేరీలో తీసుకొందురు. మరియు హైదరాబాదు రెసిడెన్సీలోని కెప్టన్ రషన్ గారును, ఇంపీరియల్ బాంకువారును, సెంట్రలుబ్యాంకువారును వా. శాఖలవారందరును ఈనిధికిచ్చు ద్రవ్యాన్ని తీసుకొందురు. చెక్కులుపంపువారు హైద్రాబాదు హరికేన్‌నిధిపేర పంపవలెను. ౧౦ రూపాయిలనుండి ౪ అణాలవరకున్న రసీదుపుస్తకములుమా సంతకాలతో ఫైనాన్సు కచ్చేరీలోను రెసిడెన్సీలోను ౮ జూలైనుండి దొరకును. ౧౦ రూపాయిలకుమించిన చందాలను పత్రికలలో ప్రకటింతుము.

సంతకములు

సర్ అక్బర్ హైదరీ
(ప్రధానమంత్రి)
సీ. ఎచ్. గిడ్నీ
(రెసిడెంటు)

సర్ అక్బర్ హైదరీగారు గౌ॥ గిడ్నీ రెసిడెంటుగారును వైనిధికి చెరి ౧౦౦౦రూపాయిల చందాఇచ్చినారు.

— —

# బోసు నిర్బంధ విచారసభ

### హిందూముస్లిం ఐక్యత కొక దెబ్బ

(ఒ.వి.) ఖమ్మం జూలై 3.

నేడు సాయంత్రము సుమారు ౧౦ ౫-౩౦ లకు పురవాసులు సమావేశమై హిందూ ముస్లిం ఐక్యతకు మిక్కిలిగా కృషిసల్పుచున్న శ్రీయుత సుభాసు చంద్రబోసుగారిని అరెస్టు చేసినందువలన హిందూముస్లిం సఖ్యతకు ఒక పెద్ద దెబ్బ తగిలినదని సభికులు తమవిచారమును వెలిబుచ్చిరి. సమావేశమునకు సుమారు నలుబది మంది హాజరు అయిరి.

— —

# జమాబంది మురాఫాల చిక్కులు

### ఖాదీవస్త్రాలయ స్థాపన

(స్వ.వి.) జోగీపేట, అమర్దాదు౩౦

మా అందోల్ తాలూకాలో జమాబంది పూర్తియగువరకు తీరునెలదాటి అమర్దాద్ నెల పడినది. ఈఅమర్దాద్ నెల ౧౦తేది లోపలనే అన్నియూరుల పన్నులు పూర్తిగ ప్రభుత్వకోశమునకు చేరవలయునని ఆక్సాతులు నియమితమైనవి. ఇక మురాఫాలు చేయువారికి చాలినంత గడువు లేక పోవుటయు అకోద్దిసమయమున్న ను'' జమాబందియైనవెంటనే రైతులపైఁ దుఎక్కువపన్నులు రైతులకు తెలియపర్చవలయునని''ఎన్నిగస్తీలున్నను పన్నుచెల్లించు సమయమువరకు ఆట్టిపన్నులు తెల్యపరఁకుండుటయు, మున్నగు ఇబ్బందులచే మురాఫాలు చేసినవారికి ఇత్తెవాయికోరకు వ్యవహారము జరుపువరకు అక్సాల్ దాటిపోవుచున్నదని మాత్రము నిరీక్షించక అస్తులజప్తులు మున్నగునవి తటస్థించి రైతులు న్యాయముపొందజాలక పోవుచున్నారు. ఇకముందైన ప్రభుత్వమువారు జమాబందియైనతదుపరి పన్నులుచెల్లించుతేది, మురాఫా ముద్దతుయగువరకైన (లేక కనీసము రెండుమాసములైన)గడువొసగి, మరియు జమాబందియైనవెంటనే పట్వారీలు రైతులకు ఎవరికెంత నియమితమైనది తెల్యపర్చి, తమకు తెలిసినటుల రైతులనుండి దస్తకతు తీసుకొనుటకు గట్టిఏర్పాటు గావించినసేకాని రైతు సౌకర్యమునకై జమాబంది మురాఫాలకై యేర్పాటుచేసిన శాసనము స్వార్థకమగును.

౨. మాతాలూకాలో స్వదేశవస్తువుల వాడవలయుననుయభిమాను లెందరో నున్నను అందుబాటు సౌకర్యములేనికారణమున తమ యుద్దేశ్యము పూర్తి కాజాలక పోవుచున్నదని, పలువురు యభిప్రాయము వెల్లడించియుండిరి. వారిసౌకర్యమునకై కొందరిప్రోత్సాహమున స్వదేశవస్తు పరిశ్రమలలో అతిముఖ్యమైనది. ఖాది పరిశ్రమయైనందున. ఖాదివస్త్రములు అందోల్ తాలూకావాసుల అందుబాటులోనుంచుటకై తాలూకా కేంద్రమగు జోగిపేటలో శ్రీమాణిక ప్రభు ఖాదీ వస్త్రాలయమనుపేరున మామిత్రులగు శ్రీ మురీల్‌కర్ గోవిందయ్యనువారు, నొక దుకాణమును తెరిచియున్నారు.

సొంతసైకిల్‌వారినుండి ౧-౨-౦పన్నునుకిరాయసైకిల్‌వారినుండి౨-౨-౦పన్నును తీసుకొందురు ఈనెలదాటినతర్వాత సొంతసైకిళ్లకు ౨ రూపాయిలున్ను కిరాయసైకిళ్ళకు ౩ రూపాయలున్ను తీసికొందురు.

# బాల్యవివాహ నిషేధ శాసనము

### వింతతర్కం! అంధ్రరక్తం !!

నేడు సాయంకాలము ౪గంటలకు శ్రీ. ఉమామహేశ్వర పండిత్ సికింద్రాబాదుగారు పెద్ద బజారులో ఉపన్యసించిరి! సభికులసంఖ్య సుమారు (౨౦౦)వందలకుపైగా నుండెను. పైవారు మాట్లాడుచు దేశదేశములలో యువతీవివాహములచే అనేకఅనర్థములు గలుగుచున్నవని వివాహముకాని యువతులందఱు గర్భధారులేనని విదేశములలో వివాహమైన ౫ ఉ, ౪ మాసములలోనే అనేకమంది శిశువులు జన్మించినారని పైబిలుయొక్క అనర్థములను తెలసికొని యిప్పుడు దానిని తీసివేయ ప్రయత్నించుచున్నారని, మన మేమో యీశారదాబిల్లును, విదేశీయులు తినికక్కినకూడునకై పెనుగులాడిన విధముగా నున్నదని చెప్పిరి:

బాల్యవివాహములే మనకు ఆచారమని. పూర్వసాంప్రదాయము విడువవద్దని నొక్కి చెప్పిరి. రేపు అబిల్లువచ్చిన మనకన్యలను బజారు కెక్కించి వారిమానములనుతీసి యుక్తవయస్సా! కాదా? యని డాక్టర్ పరీక్షకు లోనుగా చేయవలయునని కల్లబొల్లిమాటలతో భయపెట్టుచు యిది యెంతమాత్రము శ్రేయోదాయకముకాదనిరి. అధునికులందఱు అంధ్ర. గోలకొండ మొదలగుపత్రికలు చదివిన నవీనసాంప్రదాయములను చెప్పెదరు. వీరందరు జ్ఞానములేనివారనిరి

సనాతనుల మందు బల మున్నదనియు, యీబిల్లునుచించి చెండాడెదమని డంబములు పలికిరి. ఉపన్యాసమును ముగించుచు యీబిల్లునునిషేధించుటకై సంతకములుకావలెననియు, రేపు ఉదయము౪గంటలకు మీరురావలయుననియు. రానివారలు మాతృద్రోహులనియు. వారిలిల్లలు పతివ్రతా స్త్రీలు కారనియు, దౌర్జన్యమునకర్జించిరి.

తరువాత కొందరి సభ్యుల పేరులను సహాయసంఘమునకు ఎన్నుకొనిరి. పటుకారిరాజులు. కాసనగొట్టురంగరాజ, మొలుగు కిష్టయ్య. కూరారామన్న, బిబిపేట విశ్వనాథశాస్త్రి. శివదేవుని విశ్వనాథం. తూర్పుపెట్టయ్య,జగన్నాథుశేట్. బద్రిశేట్, ఘాసీరాంశేట్, మొదలగువారిని ప్రకటించిరి.

తెల్లవారి తేది ౨౮ అమర్దాదు ఉదయము అంధ్రమహాసభ తాలూకాసంఘసభ్యులుగ చేరిన కొందరిసాహుకార్లను వెంబడించి బజారులో వచ్చేపొయ్యే, శూద్రాదులగు (గొల్ల, కుర్మ చాకలి, మంగలి, తెనుగు. కాలి-భోయి,) మొదలగు అవ, మగవారి వ్రేలిముద్రలుగైకొనిరి, తర్వాత కొందరుయువకులుండు దుకాణములలోకి పండితులవారు విజయముచేసి సంతకములు కోరిరి. అందుకు వారు విద్యావిహీనులు పైసాకుపకరపద్దరుకుతారు యిదేవిధముగా పూర్తిచేసికొమ్మని సరిపోవునని చెప్పిరి. మేముదుగుదానికి సమాధానం యిస్తె సంతకములుచేసెదమని యువకులనిరి. దీనితో పండితులవారి కాగ్రహముగల్గి మీరు సనాతనుఁ కారా! మీకిష్టములేదా! అచుమ వెళ్ళబోయిరి. మీరుచెప్పినదేవినుటకు దున్నలు కాముని యువకులు హెచ్చరించిరి, దీనితో పండితు డమితాగ్రహముజెంది బుర్రునఎగిరిపోయిరి. మళ్లీ మధ్యాహ్నము ౨ గంటలకు ఒకచో సమావేశమై శంకాసమాధానము చేయగలనని అహ్వానించిరి. కొందరు పోయి కూర్చుండి కన్యావివాహ కాలపరిమితిని తెల్పుమనికోరిరి. అందుకువేదములన్ని క్షత్రియులకుతప్ప బాల్యవివాహములే చెప్పినావని వాదించిరి. రజస్వలాత్పూర్వ మెప్పుడైనా పరేనని చదివిచెప్పిరి. మరియు యువకుడైనపురుషుడు చిన్నపిల్లను వివాహమాడ శాసించియున్నదని పండితులవారు చెప్పిరి, అందుకు శ్రీయుత బెజుగం లింగయ్యగుప్తగారు ప్రశ్నించుచు ఇప్పుడు జరుగు వివాహములు యిదేమాదిరిగా జరుగుచున్నవాఅనిరి. పండితుడు నేను శాస్త్రమును చెప్పుచున్నాను. మిగత విషయములు నన్నడుగవద్దనిచెప్పిరి. తర్వాత ఎన్ని ప్రశ్నలువేసిన సమాధానము చెప్పలేక కవిలె. పంచాంగముకట్టి సవరించుకొని చంకించి తొకర్ఘుడించిరి.

అప్పుడు బీబీపేట విశ్వనాధ శాస్త్రి సిద్ధిపేటగారు అం.ధమహాసభను నిందించుచు. అంధ్రులైయైనచో అం ధరక్తము అంధ్రబీజమునకు పుట్టిన వారలేయైనచో బాల్యవివాహనిషేధ శాసనమును ఆమోదించరని గొంతుచించుకొనుచు వాగిరి.

తాలూకావాసులు ఖాది వస్త్రములను కొని వారియుద్యమమును ప్రోత్సహించెదరని తాలూకావాసులను కోరుచున్నాను.

ఏగ్రామస్థులైన అచ్చటికి వెళ్లజాలక పోయినచో కొందరుకలసి పైవారికి వ్రాసిన తమయింటికితెచ్చియిచ్చు సౌకర్యము నేర్పాటుగావించియున్నారు. ఇతరగ్రామములకు వెళ్లినచో రూపాయకు అర్థఅణా హెచ్చు: తీసుకొందురు.

# పోలీసుపటేలుగారి జబరుదస్తి

ఎల్లుగొల్లపహాడు తిథి ౪-౩_౪౦

ఇది జనగామతాలూకాలోని గ్రామము ఇది జనగామకు, ౭-లేక ౮-మైళ్లదూరమున వుండును. ఇక్కడ ఎవరింట్లోనైనను గోడలుకూలిపోయినఎడల అదికట్టించుటకు పోలీసుపటేలుగారిని అనుమతి అడిగితె యేమన్నలంచములు ఆడుగుదురు వీరికి లంచములు ఇవ్వకున్న చాలా ఇబ్బందులుపెట్టుచుందురు లేకున్న తహస్సీలునుంచి అనుమతి తీసుకరమ్మంటారు ఇదివర్షాకాలము ఎన్నియోగోడలు కూలుచుండును, ఎన్నో ఇండ్లుపడియుచుండును ఇట్లుకూలినను కురిసినను ప్రతివిషయానికి అనుమతితీసుకరమ్మన్నయెడలప్రజలకు ౭, ౮, మయిళ్లు పోవటానికి చాలాయిబ్బందులు కలుగుచుండును.

కనుక తహస్సీలువారు ఈయొక్క పోలీసుపటేలుయొక్క జబరుదస్తీమాన్పి ఈబీదప్రజలను రక్షించుదురుగాక,

ఇట్లు
నెల్లుట్ల సీతారామచంద్రరావు

# లాలుదర్వాజలో మున్నూరుకాపుసంఘ స్థాపన

హైదరాబాదు, ౨౩ అమర్దాదు ౪౯ఫ.

నేడు ఆందరూను మరియు వేరూను లాలుదర్వాజలో నివసించు మున్నూరు కాపుకులసోదరులసభ సమావేశమై మున్నూరు కాపుసంఘము స్థాపించబడినది. శ్రీముద్దం మల్లయ్యగారు-అధ్యక్షులు, శ్రీ సత్రంశెట్టి కిష్టయ్యగారు-ఉపాధ్యక్షుడు, శ్రీమిరియాల యాదగిరిగారు-కార్యదర్శి, శ్రీడ-క్టరు లోహంశెట్టి బాలకిష్టారెడ్డిగారు సహాయకార్యదర్శి. మరిఆయిదుగురు సభ్యులుగాను శ్రీ బండారి మాణిక్యం శ్రీ మనికొండ నారాయణస్వామి, శ్రీ నాగులపల్లి ఎల్లయ్య, శ్రీ అలగడ్డల సత్తయ్య, శ్రీ అల్లం బాలకిష్టయ్యగార్లు గల కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను.

పీఠ్ఠానలో శ్రీపతిరంగయ్యగారి గృహమందు శ్రీ మిట్టా లక్ష్మీనర్సయ్యగారి అధిపత్యమున జరిగినసభ తీర్మానములు నిరసించబడినవి. తదుపరి సభ కృతజ్ఞతతో ముగింపబడినది.

# ఇత్తెహాదుల్ ముస్లిమీన్ రహస్యసభ

హైదరాబాదు(దక్కన్) అమర్దాదు౩౧

౩౦ అమర్దాదునాడు సాయంకాలము ౫గంటలనుండి ౭గంటలవరకు అంజుమనె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘముయొక్క కార్యనిర్వాహకవర్గమువారిసభ బేగంబజారు వెహిద్వీవంజిల్‌లో జరిగెను. ముఖ్యులంతా వచ్చియుండిరి, రౌఫ్‌గారు సయ్యదలీగారు, హుసేనీబాదుషాగారు కలీముద్దీన్‌గారు మరియితరులంతా వచ్చియుండిరి. బంగ్లాపై కొట్టిడితలుపులు మూసికొని మూడుగంటలు ఆలోచనలుచేసిరి, ఏమిచేసిరోతెలియదు. రాత్రిభోజనానికి లేచిరి. ఏమైందండీ అని రౌఫుగారిని ఒకరువిచారించగా మరల రాత్రి ౯-౧ గంటలనుండి ఆలోచనలోకూర్చుంటున్నాము అని అన్నారు. ఇంతవరకు మించి ఏమియు సందియ్యలేదు.

(రహీంబర్)

# సైకిల్ పన్ను

హైదరాబాదు నగరపాలక సంఘమువారు ఈ మిహరేవర్ నెల తుదిలోపల పన్నులిచ్చువారికి సౌకర్యముకలిగించినారు. ఈ నెలలోపల

# హైదరాబాదు బి.జి. శికింద్రాబాదు మరియు హౌరాలమధ్య (నాగపూర్-బల్లార్షద్వారా) రిటర్న్‌టిక్కెట్లు

1,2 తరగతుల రిటర్న్‌టిక్కెట్లు మరియు నౌకరులకొరకు ౩వతరగతి రిటర్న్‌టిక్కెట్లు యివ్వబడును. 30 జూన్ 1940 వరకు అమలునందుండును.

చీఫ్ కమ్మర్షియల్ మేనేజరు
హ.ఘ.వ. నిజాంస్టేటురైల్వే
శికింద్రాబాదు.

## గణపతి సేవనాటి అల్లరులు

**అరుగురిపై నేరస్థాపన**

జగిత్త్యాల.

౨౬ అమర్దాదునాడు జగ్త్యాల మున్సిఫ్ కచ్చేరీలో గణపతిసేవనాటి అల్లరులవిచారణ మొదటి దశ ముగిసెను. ౯ అజూర్ ౧౩౪౯ నాడు జగ్త్యాలలో హిందువులు గణపతిసేవతో ఊరేగింపు చేసిరి. ఆసందర్భములో కొందరు ముసల్మానులు ఊరేగింపుపైబడి లాఠీలను కత్తులనుప్రయోగించి కొట్టియుండిరి. తత్ఫలితముగా కొందరికి బలమైన గాయాలుతగిలెను. వారిని చాలానుచేసిరి. కేసు విచారణ జరుగుతూవచ్చెను. గతవారమునాడు ముబారక్ బషీరుద్దీన్, షేకుమహమ్మద్, మహమ్మదుఅబ్దుల్ జలీల్. అను ౧౫ ఏండ్లు వయసుగల విద్యార్థి. వాహిద్‌హుసేన్ అనువారిపైనను ఇంకొకరిపైనను మొత్తము ౬మందిపై నేరము స్థాపించి ఫర్దిజూరుం) వినిపించినారు. అస్థాపనను మేజిస్ట్రేటు ఇట్లువినిపించిరి.

"మీరు ౯ అజూరుపాదురాత్రి ౧౦- ౧౧ గంటలవేళ క్లాకుటవరువద్ద హిందువులు మతోత్సవపు ఊరేగింపుజనులు గోవింద గోవింద అని కేకలువేయుచు వచ్చుచుండగా మసీదుముందు వాద్యమును ఆపివేయించవలెనని కలబలుకొని లాఠీలు, కత్తులుధరించి సుమారు ౫౦౦గల హిందువులపైబడి కొట్టినారు. కొందరికి గొప్ప ప్రమాదకరమగు దెబ్బలుతగిలినవి. మీరు అల్లరి(బల్వా) అను శిక్షాస్మృతిలోని ౧౪౫సూత్రముప్రకారము తప్పుచేసినారు. కర్నాల వెంకటనరసయ్య, నూకలచ్చయ్య, రాంకిష్టయ్య బాపెట్టిచిన్న రాజం మున్నగువారికి దెబ్బలుతగిలినవి. అందులో కర్నాల వెంకటనరసయ్యకు రామకిష్టయ్యకు బలమైన దెబ్బలు తగిలినవి. కావునమీరు శిక్షాస్మృతి ౧౪౭-౨౨౬-౨౨౭ సూత్రాలక్రింద నేరముచేసినవారైనారు." అని మున్సిఫుగారువినిపించిమీసమాధానమేమి అని నిందితుల విచారించినారు. నిందితులలో ౫ మంది "అయ్యా, మేమానాడు అల్లరిజరిగినచోట లేనేలేము మాకేమిన్నీ తెలియదు." అని అన్నారు. మహమ్మద్ అబ్దుల్‌జలీల్ అనేవిద్యార్థి యిట్లన్నాడు: "వందేమాతరంవ్యవహారంలో రామకిష్టయ్యకునాకు శత్రుత్వం కలిగింది అందుచేత అందుచేత అతడునన్ను ఇందులో ఇరికించినాడు." నిందితులు తూద్పుసాక్ష్యాన్ని (సఫాయి) చెప్పించుతామన్నారు.

## ప్రకటించబడని వ్రాతలు

ఈక్రింది విషయములనుగూర్చి మాకు చేరిన వ్రాతలను ప్రకటించజాలనందుకు విచారపడుచున్నాము.

౧) తిమ్మాజిపేటలో మారుతిగ్రంథాలయములో హరికథతర్వాత చదువబడిన పద్యములు

౨) నారాయణపాట

3) నిజామాబాదు ఆర్యసమాజ ప్రధానుగారికి డి. వి. స్వామిగారు తెలియబరచినది.

౪) రాయగీరుతాలూకాని కొమాళ్ళగ్రామం పట్వారిగారి నిరంకుశత్వము (ఇట్టివార్త ఇదివరలో వచ్చినదే)

౫) జెంగూరులో వేణుగోపాల కృష్ణ పుస్తకభాండాగారము

౬) నిజామాబాదుజిల్లా ఆర్మూరు తాలూకా నడుకూడగ్రామంలోను, పర్భణిజిల్లా పూర్ణాపట్టణ గ్రామాలలోను బాల్యవివాహ నిషేధశాసన నిరసనతీర్మానములు

౭) జనాభాకు పంతులమ్మల ఏర్పాటు

౮) సంగారెడ్డిపేట అమ్మవారిజాతర (సంతకములేదు)

౯) టి. వెంకటరెడ్డి గారిపద్యాలు

౧౦) గౌడ స్త్రీల తిరుగలిపాటలు

౧౧) దేవరకొండ బీదరైతుల కష్టములు (ఇందులో బీదరైతులకష్టాలసంగతి సున్న)



## ఇంతవరకు వర్షములులేవు

(ఒక విలేఖరి)

పత్తేపురము, అమర్దాదు ౨౬

ఈగ్రామము నల్లగొండజిల్లాలోని హుజూరునగరు తాలూకాలో చేరినది. రోహిణికార్తిలో కొద్దిగా చినుకులుపడినవి. కాని నేటివరకునూ వర్షములు కురిసియుండలేదు. ఆర్ద్రకార్తె వెళ్లటమువరకు సమీపించినది; కాని భూమిలో విత్తనములు వేసియుండనందున ప్రజలు చాలా భీతిల్లుచున్నారు. పశువులకు అడవిలో త్రాగుటకు నీరు, మేయుటకు మేతలేదు కూలివారలకు కూలిపని దొరకుటలేదు, ఆబీదలకు ఋణములయిచ్చేవారు కాలపరిస్థితిని చూచి వుపేక్షించినందున చాలా ఘోషిలుచున్నారు. ఇకముందు సెటుల జరుగవలసియున్నదో తేటపడుటలేదు.

## నిజాంరైల్వేవారు—యుద్ధసహాయము

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౨౫

యుద్ధపరికరములను సిద్ధముచేసి యుద్ధానికి ఎక్కువగా తోడ్పడేనిమిత్తమై నిజాంరైల్వేలో కోనూపరింటె డెంటుగారగు యస్. ఇ. హాఫ్ గారు ౩౦జూన్‌నాడు జబ్బల్పూరుకు వెళ్ళినారు. అచ్చట తుపాకుల నిర్మాణయంత్రాలయముల పద్ధతిని చూచి హైద్రాబాదు రైల్వే వర్కుషాపులలోను అట్టివిధానమును ప్రవేశపెట్టుటకై వెళ్ళినారు.

### హిందూబాల్యవివాహనిషేధశాసనము

౨౫-౬-౪౦ న యెల్లారెడ్డితాలూకా జంగమాయపల్లెలో సనాతనసభ జరిగెను. సనాతనధర్మప్రచారకులు ప్రౌఢవివాహమువల్ల నష్టములను తెలుపుచు బాల్యవివాహమే సర్వశ్రేయోదాయకమని ఉపన్యసించిరి. తరువాత సభవారు ఇప్పుడు శాసనసభయందు శాసనమంగీకరించరాదని తీర్మానించబడెను.

## పాతదొంగ-కొత్తదొంగతనము

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౨౫

మహమ్మద్‌బిన్ ముబారక్ అను అరబ్బును హైద్రాబాదునగరమందలి పోలీసువారు ఇటీవల పట్టుకున్నారు అన్వరుల్లాఅనే ఇంజనీయరుగారి యింట్లో రూ౩౦౦౦ విలువగల సొత్తులు మాయమైయుండెను. పోలీసువారు విచారించగా పైఅరబ్బు దొంగతనముచేసినట్లు తెలిసెను. అతన్ని నగర న్యాయాధికారియెదుట నిలబెట్టిరి. ౧౫ దినాలవరకు పోలీసువారి వశములో నుండునట్లును అంతటపోలీసువారు విచారణచేసి చాలాన్ చేయునట్లును ఆజ్ఞాపించినారు.

ఈ అరబ్బు ఇదివరలో ౧౨ ఏండ్లకాలము జెయిలుశిక్షను అనుభవించినవాడు. ఇదివరలో ఇట్టివెన్నో దొంగతనాలుచేసి జెయిలులో మూసియుంచబడియుండెను. తుదిశిక్ష పూర్తియైనతర్వాత జూన్ ౨ వతేదినాడు జెయిలునుండి సెలవుపొంది బయటపడియుండెను. పాత అలవాటు అతన్ని ప్రేరేపించెనేమో మళ్లీ ఈ కొత్త నేరములో ఇరుకున్నాడుపాపం!

## మేలాద్ జల్సా

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు ౨౬

౨౬ అమర్దాదునాడు హైద్రాబాదులో నూరుల్ ఉమ్రాబజారులో మేలాదుసభ చాలగొప్పదిజరిగెను. ఖాయదెమిల్లతుఇస్లామియా దక్కన్ అను బిరుదావళీ విరాజమానులైన నవాబు బహద్దరుయార్జంగు బహద్దరుగారును సభనలంకరించిరి. వారు ముసల్మానులకు తమఆజ్ఞల రెంటినివినిపించిరి. ౧ ఇత్తెహాదుల్ ముస్లిమీనుయొక్క క్రొత్తనియమాలు చాల బాగాయున్నవి. అందరున్నూ దానిలో చేరవలెను. ౨ తక్షణమే ముస్లిం యువకులంతా స్వచ్ఛంద సైనికులుగా చేరవలెను. అబుల్ హసన్ సయ్యదలీగారును ఈవిషయాలనేవినిపించి రాష్ట్రరక్షణార్థము వెంటనే స్వచ్ఛందసేవకులు అసంఖ్యాకులుగా చేరవలెనని చెప్పిరి.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఆషాఢ శు॥ ౩

సోమవారము


## స్త్రీల అభివృద్ధి

మనము మన స్త్రీలను వంట యింటికి పడుకటింటికి మాత్రమే సిద్ధముచేసినాము అని డాక్టర్ సీ. ఆర్. రెడ్డిగారు ఒకమారు సెలవిచ్చియుండిరి. మన దేశములో అన్ని పరిశ్రమలు అధోగతి పాలైనవి. ఒక పరిశ్రమమాత్రమే నిత్యాభివృద్ధిలో నున్నది. అది పిల్లల పుట్టించు పరిశ్రమ అని ఒక బెంగాలీనాయకులు సెలవిచ్చియుండిరి. హిందూ వితంతువు నీతిబాహ్యమైనట్టిది అనిఒక ఇంగ్లీషువ్యక్తి తప్పుడుకూత కూసియుండెను. ఇక మిస్. మేయో అను అమెరికా స్త్రీ మన స్త్రీలను తిట్టిన తిట్టును మళ్ళీతిట్టకుండా తన మదర్ ఇండియా అను బూతు గ్రంథములో నిందలు చేసియుండెను.

భారతీయ స్త్రీలలో ప్రతిజాతిలోను ఏవో కొన్ని సంస్కరణీయాంశములున్నవనుట నిస్సందేహము. ఒక మతానికి ఘోషాకలదు. ఒకమతములో బాల్యవివాహాలు కలవు. ఒక జాతిలో మాటమాట్లాడితే విడాకులిచ్చు అధికారమున్నది. ఒకజాతిలో వితంతువులు యావజ్జీవితము బ్రహ్మచారిణులు గా నే యుండవలెను. ఒక సంఘమువారి మతములో స్త్రీలకు చదువు చెప్పగూడదు, వారికి స్వాతంత్ర్య మీయగూడదు. ఈ విధముగా ఎన్నెన్నో అవస్థలు మన స్త్రీలకున్నవి. బెంగాలులో స్త్రీలును బలవంతముగా ఎత్తుకొనిపోవుచుండు అభియోగాలను ఎప్పుడును వినుచుందుము. స్త్రీలకు ఆత్మరక్షణశక్తి పూర్తిగానశించిపోయినది. మన సంస్కృతిలోపమునియు మన సంఘములో నాగరికత తగ్గుటకు వచ్చినదనియు ఈ యంశాలు రుజువుచేయుచున్నవి. ఇతరులమాట మనకెందుకు గాని హిందూస్త్రీలను గురించియే ఆలోచింతము. కొందరు ప్రతిదానికి శాస్త్రములో ఏమి ఉన్నది అని పరిశోధన లిప్పటికిని చేయుచున్నారు. కాని ప్రపంచము ఏధోరణిలో పోవుచున్నది అనునది విచారించరు. జపానులో స్త్రీలు పురుషులను ఏవో కొన్ని ఒడుపులచేతనే క్రింద పడగొట్టు "జుట్సూ" అను కీలకమును అందరును నేర్చుకొనినవారై యున్నారు. యూరోపులో ఇప్పుడు స్త్రీలుకూడా యుద్ధకుశలతను సంపాదించినారు. మోటార్లు నడుపుదురు. విమానాలు నడుపుదురు. తుపాకులు కాల్తురు. యుద్ధముచేయుదురు. యూరోపు ఖండములోను, అమెరికాలోను ఏవోకొన్ని ప్రాంతాలలో తప్ప మిగత భాగాలన్నింటిలోను స్త్రీలు నూటికి ౮౦—౯౦ నుండి వరకు విద్యావతులైనారు.

అయితే మనముమాత్రము ఉన్న చోటనే ఉన్నామో లేక వెనుకకే పోయినామో చెప్పజాలము. మా అభిప్రాయములో మన స్త్రీలు పూర్వముకన్న ఇప్పుడే హీనస్థితిలోనున్నారు. పూర్వము మన స్త్రీలు వేదచర్చలు చేసిరట. చారిత్రిక యుగములో మన స్త్రీలు యుద్ధాలుచేసిరి. రాజపుత్రస్త్రీలు ప్రపంచములో నేదేశమందును ఏజాతిలోను చూపనట్టి శౌర్యము, దర్పము, శక్తి సామర్థ్యములు ప్రకటించిరి. ఇంచుమించు ప్రతి రాజపుత్రస్త్రీయు సవారిచేయుట, కత్తితిప్పుట నెరిగి యుండెను. ఇప్పుడు స్త్రీలకావిద్య యెచ్చటనురాదు. పైగా పురుషులే తమ స్త్రీలను కాపాడలేనివారై యున్నారు.

గతవారము బొంబాయిలోని ఇండియన్ స్త్రీ విద్యాపీఠము యొక్క స్నాతకోపన్యాసమును సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు గావించిరి. అందు వారుచేసిన కొన్ని సూచన లేమనగా "జపాను దేశములో స్త్రీలు భార్యలగుటకు కొంత శిక్షణపొందుదురు. అచ్చట స్త్రీలు భార్యలగుటకుగానుకుట్టుపని నేర్చుకొనవలెను. గృహనిర్వాహణములో ప్రవీణతపొందవలెను. శిశువులపోషణ పద్ధతుల నెరుగవలెను. అవకాశములందు ఆర్జించ గలుగుటకై ఏదైన ఒకవృత్తి విద్య నెరిగి యుండవలెను." అని చెప్పినారు. మన దేశములో బీదలకివిరావు. ధనికుల కివి అవసరము కావు.

మరియు వారిట్లు సెలవిచ్చినారు. "హిందూ వితంతువునకును, బిడ్డకును ఆస్తులలో అధికారాలులేవు, అందుచేత వారికి ఆర్థిక స్వాతంత్ర్యమేమి యుండదు" హిందువులలో బహుసంఖ్యాకులు ఈ సమస్యకు వ్యతిరేకులై యున్నారు, స్త్రీల కందరికిని విద్య, అవసరమైనంత వరకు స్వాతంత్ర్యము, దేశాభివృద్ధి కుపకరించునట్లు చేయుట, అను మూడువిషయాలు చాలా ముఖ్యమైన పనియు సర్ మోక్షగుండంగారు అభిప్రాయపడినారు. స్త్రీలు శరీరదార్ఢ్యతను ఏమాత్రమును మరచిపోగూడదనియు, వారు శరీర వ్యాయామము చేయుచుండవలెననియు తెలిపినారు. ఇప్పుడు మహారాష్ట్రభాగములో స్త్రీలకు కర్రతిప్పుటను, సాముచేయుటను నేర్పించుచున్నారు. ఆర్యసమాజమువారు తమతమ సంస్థలలో స్త్రీలకు కర్రతిప్పుట, కత్తి తిప్పుట నేర్పించుచున్నారు. బెంగాలులోను ఇది ప్రారంభమైనది. అయితే ఆంధ్రులలోమాకు ఈ విధానము సఫలంబించుటలేదు. ఈవిషయాన్ని గమనించి శ్రద్ధచేయకుండా తమ బాలికలకు పుస్తక విద్యతోపాటు ఆత్మరక్షణ కరము గు [illegible] వ్యాయామవిద్యను కూడ లోపములేకుండా నేర్పుతురుగాక. స్త్రీలు వృద్ధికి వచ్చిన జాతియంత యున్నతికివచ్చును. మన స్త్రీలు పికికివారెవ వారే సాతాయనుకు [illegible] రమే. ఈ ప్రధానసూత్రమును మన [illegible] గుంవద నను బాగుగా గమనించి ఆలోచించి స్త్రీ అభివృద్ధికైనను తోడ్పడుదురుగాక.

## హైదరాబాదు హరికేన్ నిధి

మన ప్రధాన మంత్రులును గౌ॥ రెసిడెంటుగారును యుద్ధ సహాయార్థమై ప్రకటించిన ప్రకటన వేరుచో కానవగును. హైదరాబాదు, సికింద్రాబాదు పౌరులు తలచుకొనిన అదొక గొప్పపని కాదు. ధనికులే యియ్యవలెనను నియమములేదు. నాలుగణాలనుండి రశీదులియ్యబడును అని చెప్పుటచేత నాలుగణాలు మొదలుకొని యెంతపెద్ద మొత్తాలనైనను ప్రతివ్యక్తియు తన శక్తికొలది యియ్యవచ్చును. ఇది పౌరుల ధర్మము.

అధికారులు ముఖ్యముగా ఈ నిధికి చందాలియ్యవలెను. మనకు మద్రాసున్ను, తిరువాన్కూరున్ను, అప్పుడే మార్గము చూపించినవి. మద్రాసులో ౬ నెలల కాలమువరకు ౧౨౦ రూపాయలకు పైగాపొందు ఉద్యోగులవద్ద ఒక దినము జీతము వసూలుచేసినారు. తిరువాన్కూరులో ౩౦౦ రూపాయలకుపైగా నెలజీతము పొందువారు నూటికి ౧౨రూపాయిలున్ను, ౧౦౦ కి పైగానుండువారు ౭౫ రూ.లున్ను, ౫౦ కి పైగా పొందువారు ౫ రూ.లున్ను యిచ్చినారు. మనరాష్ట్రములోని ఉద్యోగులును సులభముగా సంతోషముగా తమ నెలజీతములనుండి పట్టియ్యవచ్చును. ౧౦౦ రూపాయిల లోపలివారిని శ్రమపెట్ట పనిలేదు. ౧౦౦ నుండి ౫౦౦ ల వరకు జీతముపొందువారు నూటికి ౧ నుండి ౫ వరకును, ౫౦౦ లకన్న పైబడి ఆదాయముగల అదృష్టవంతులు నూటికి ౧౦రూపాయల ప్రకారమును తమ కిబ్బందికలుగకుండానే చందాలిచ్చుకొనగలరు. ప్రభుత్వమువారీ విధముగా జీతాలలో నుండి ౬ మాసాల మొత్తము లెక్కజేసి పై హరికేన్‌నిధి కిప్పుడే యిచ్చి ప్రతినెలకును జీతాలలో పట్టుకొని ఖజానాలో జమకట్టవచ్చును. మద్రాసులో ఇట్లుచేసినారు. ఇచ్చటను ఇట్లే చేయుటలో ఎవరి కాక్షేపణయుండునో మేము తెలుసుకొన గోరుచున్నాము.

ముఖ్యముగా ఉద్యోగులును, ధనికులును, నిధికి విరివిగా సహాయము జేయవలెను. సాధారణ స్థితిలో నున్న వారును యథాశక్తి సహాయము చేయవచ్చును.

యుద్ధసహాయ విషయములో ఈరాష్ట్రములో ఎవ్వరును ప్రతికూలత నూపించరు. రెండువారాలనాడే మన ప్రజానాయకులు చేసిన ప్రకటనను జూచిన జనులలోగల సుముఖత వెల్లడియగుచున్నది. అందరిమాట అటుంచండి. మన ఆంధ్రులకు ఈ విషయములో అగ్రతాంబూల మియ్యవలెను. అయిదుగురు మహాసభాధ్యక్షులు ఒకేతడవ తమ మనవిని పత్రికలో ప్రకటించినారు. నాయకులు తొక్కిన బాటలోనే అనుయాయులు నడుచుదురు. కావున మన కుపూజ్యులైన ప్రధానమంత్రిగారు గౌ॥ రెసిడెంటుగారును తలపెట్టిన కార్యానికి జయమే కలుగును.

## ఉస్మానియాలో తుర్కీ

హైదరాబాదు(దక్కన్) అమర్దాదు౧

ఉస్మానియా కాలేజీలో తుర్కీభాషను నేర్చుకొనయనతర్వాత సాహితంతం వారానికి రెం డుసార్లు ఏపలుకైకొని విద్యార్థులకు బయటినుండి యింకా యెక్కువైన అభిలాషగలవారు అట్టివారికే నేర్పే ఏర్పాటుచేసినారు.

## బ్రిటిషుసామ్రాజ్యానికే జయము

గౌ॥ రెసిడెంటుగారి ఉపన్యాసము

సికింద్రాబాదు (దక్కన్), అమర్దాదు ౨౯

సికింద్రాబాద యుద్ధకమిటీవారి సభ బుధవారమునాడు జరిగినది. అందు గౌరవనీయులగు రెసిడెంటుబహద్దరుగారు అధ్యక్షులుగా నేర్పడిరి. సభకుచాలామంది ప్రముఖులు విచ్చేసియుండిరి రెసిడెంటుగారు సమితియొక్క ఉద్దేశాలు వివరించిచెప్పిరి. ఇంతవరకే ౧౨౪౦౦౦ రూపాయిలు ఇయ్యబడినవనిచెప్పి ఈ పనిలో శ్రద్ధవహించినవారికి కృతజ్ఞతను తెలిపిరి. పైగా చందాలు చాలా వసూలుకావలెననియు ఎంతచిన్న మొత్తాలైనను కృతజ్ఞతతో స్వీకరించబడుననియు తెలిపిరి. అందరికిని యుద్ధసహాయము చేయవలెననిన్ని, బీదవారుకూడ సహాయముచేయుచున్నారనిన్ని తెలిపిరి.

బ్రిటిషుసామ్రాజ్యమువారు ఆసిలో ఓడిపోవుచు వచ్చినను ఇప్పటికైనను తప్పకుండా జయముపొందగలరని దృఢనమ్మకము కలవారైయున్నారు. ఎందుకనగా బ్రిటిషుసామ్రాజ్యములో చేరిన దేశాలన్నియు శక్తికొలది సహాయపడుచున్నవి. అయితేయీయుద్ధాన్ని త్వరగా పరిసమాప్తినొందించి శత్రువులచేతులలోపడి నలుగుచున్న దేశాలను స్వాతంత్ర్య మప్పగించుటకై మనము సంపూర్ణమైన యావచ్ఛక్తిని వినియోగించవలెను.

మాఘునం నిజాంప్రభువుగారి అంగీకారముతో తానున్ను, రై. ఆ. సర్ అక్బర్‌హైదరీగారున్ను ఇంతలోచందాలకై జనులను తెలుపుకొందుము. ఆమొత్తముతో హైదరాబాదురాష్ట్రమువారిపక్షాన ఒకయుద్ధవిమానాన్ని యుద్ధసహాయార్థము బహూకరించుట బాగుండును. మా కోరికను అందరును నెరవేర్తురని మాకు దృఢవిశ్వాసముకలదు అని రెసిడెంటుగారు సెలవిచ్చిరి.

## ఇండియాలో విమానాల నిర్మాణము,

సిమ్లా, జూలై ౨

ఇండియాలో రెండు పారిశ్రామిక సంఘాల యజమానులు విమానములను నిర్మించవలెనని ముఖ్యముగా కోరుచున్నారు. ఒకసంఘమువారి ప్రతినిధి సిమ్లావచ్చి యిండియా ప్రభుత్వంవారితో మాట్లాడుచున్నారు. రెండవ సంఘము యొక్క పతినిధి త్వరలోనే సిమ్లా వచ్చును. ఇండియాలో విమానములను తయారుచేయించవలెనని ఇండియా ప్రభుత్వమువారుకూడ శ్రద్ధగా ఆలోచించుచున్నారు. ఒక వర్తకసంఘమువారి ప్రతినిధియు, వారు అమెరికానుంచి పిలిపించిన ఒకప్రవీణుడును, నిన్న ఇండియాప్రభుత్వ ప్రతినిధులతో సంభాషించిరి. కంపెనీ ప్రవీణుడున్ను, ప్రభుత్వప్రవీణులున్ను కలిసి సేమ మరల మాట్లాడిరి. కంపెనీవారుచేసిన సూచనలనుగురించి ప్రభుత్వమువారాలోచించుచున్నారు.

ఇండియాలో విమానాలమీద రాకపోకలకు యేర్పాటుచేసియున్న ఒక పారిశ్రామిక సంఘము ప్రతినిధికూడ త్వరలోనే సిమ్లావచ్చును. ఇతడుకూడ ఇండియా ప్రభుత్వమువారితో మాట్లాడును. ఇందుకు యంత్రోపకరణాలు, పంటవస్తువులు కావలెను [illegible] బడిసినవారుకూడ కావలెను చాలధనముకూడ కావలెను. "చీనా ప్రభుత్వమువారు చీనాలో విమానాలను నిర్మించడానికి వర్క్‌షాప్‌ కట్టించినారు. చీనాలోనే యిది సాధ్యమైనప్పుడు ఇండియాలో యిది ఎందుకు సాధ్యముకాదు" అనికంపెనీల ప్రతినిధులడిగిరి.

వాల్చంద్ హీరాచంద్ గారి ప్రణాళిక

ఈసందర్భములో ఇంకొకసంగతికూడ గమనించదగినదే. వాల్చంద్‌హీరాచంద్ గారు భారతదేశపు ఓడలకంపెనీయగు సింధియా ఓడ కంపెనీ నిర్వాహకులు. వీరు జూలై ౩వ తేది సిమ్లాలో భారతదేశపు ప్రధానసేనానిని, ఇండియా ప్రభుత్వపు అర్థకమంత్రిని, న్యాయశాఖమంత్రిని దర్శించుటకైవచ్చిరి. ఇద్దరు యూరోపియనుల సహాయ్యముతో భారత దేశములో విమానములు తయారుచేయించుటకు ఇండియా ప్రభుత్వమువారి అనుమతి పొందవలెనని వీరి సంకల్పము. వీరు [illegible] చించిన ప్రణాళికను ప్రభుత్వమువారు ఆమోదించినారు.

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౧-౧౦-౪౯ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లచొప్పున.

ధరలన్నీ హాలీవి.

| బియ్యము | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|
| | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | ౨౧ | ౦ | ౦ |
| సంబర్లు | ౨౧ | ౪ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౧౯ | ౦ | ౦ |
| రాంసాగర్లు | ౧౩ | ౧౪ | ౦ |
| సానక్రొం | ౨౦ | ౦ | ౦ |
| ఆర్కాటి | ౧౯ | ౦ | ౦ |
| కోనామణి | ౧౩ | ౬ | ౦ |
| బుడుములు | ౧౫ | ౬ | ౦ |
| జీరావరి | ౧౫ | ౬ | ౦ |
| గోధుములు | ౧౮ | ౪ | ౦ |
| ఖస్లీ | ౧౩ | ౪ | ౦ |
| లమ్కడీ | ౧౮ | ౬ | ౦ |
| పోటియా | ౧౮ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౪ | ౦ | ౦ |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౧౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౦ | ౦ |
| సెనగలు | ౧౩ | ౧౧ | ౦ |
| కందులు | ౯—౧౨—౦ నుండి | | |
| | ౧౧—౦—౦ వరకు | | |
| మినుములు | ౧౮ | ౦ | ౦ |
| లంకలు | ౧౨ | ౬ | ౦ |
| సజ్జలు | ౧౧ | ౦ | ౦ |
| కుసుములు | ౩ | ౬ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౭ | ౦ | ౦ |
| కంది ,, | ౧౮ | ౬ | ౦ |
| సిరిసెనగ ,, | ౨౫ | ౪ | ౦ |
| ఉంక ,, | ౧౪ | ౦ | ౦ |
| మినప ,, | ౨౪ | ౦ | ౦ |
| పెసర ,, | ౨౩ | ౦ | ౦ |
| బెల్లము | ౧౩ | ౬ | ౦ |
| ఉప్పు | ౧౧ | ౬ | ౦ |
| ఉల్లిగడ్డ | ౩ | ౦ | ౦ |
| మిరపకాయలు | ౧౫ నుంచి ౨౫ వరకు | | |
| చక్కెర మణుము (౪౦ శే) | | | |
| జావా ,, ,, | ౧౭ | ౨ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౫ | ౬ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౫ | ౧౨ | ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౫ | ౧౦ | ౦ |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౨౫ | ౨ | ౦ |
| దర్గాచక్కెర ,,(౪౦ శే) | ౧౮ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨ శే | ౨ | ౬ | ౦ |
| అల్లం ,, ,, | ౨ | ౬ | ౦ |
| మణుము ౧౨ శే | | | |
| కొబెన్నూరినూనె | ౪ | ౨ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౫ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్) ,, డబ్బా ౧ కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుము ౪౦ శే | | | |
| బిదరునెయ్యి ,, ,, | ౪౫ | ౨ | ౦ |
| తెలంగానా ,, ,, | ౩౩ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧ కి | ౪౯ | ౧౨ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ | ౬ | ౦ |
| తు ౧ కి | ౦ | ౧౧ | ౮ |
| సావరిన్ ౧ కి కల్దాయి రూ | ౩౦ | ౦ | ౦ |
| మారకం | | | |
| హాలీకి కల్దార్లు | ౧౮ | ౪ | ౦ |
| కల్దాయికు హాలీలు | ౧౮ | ౩ | ౮ |
| అముదాలు బస్తా | ౧౨ | ౨ | ౦ |
| వేరుసెనగ | | | |
| బుడ్డలు పల్లా౧కి | ౧౧ | ౬ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ |

గమనిక: —

౧. ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైనపొరపాటుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమదుకాణముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనిన వారి వ్యాపారానికి మంచి ప్రచారము కలుగును.

## సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము

సంస్థానప్రజల స్థాయిసంఘ తీర్మానం

బొంబాయి, జూలై ౧

అఖిలభారత సంస్థాన ప్రజాసంస్థయొక్క స్థాయిసంఘము జవహర్లాలు నెహ్రూగారి అధ్యక్షతన సమావేశమై ఈక్రిందితీర్మానమొనరించెను:—

"ప్రపంచములో జరుగుచున్న తీవ్రమగు మార్పులు రాజకీయ ఆర్థికవిధానములను మార్చివేయగలవు. ఇప్పుడమలులోనున్న విధానములు మటుమాయము కాగలవు. గొప్ప గొప్ప సామ్రాజ్యములే అంతరించుచున్నవి. యుద్ధప్రళయానంతరము సముద్భవమగు ప్రపంచములో ఇండియాలోగాని మరియెక్కడగాని, మహారాజులవంటివారి నిరంకుశపరిపాలనను కాపుదుట అసంభవము. సంస్థానపరిపాలనలో ప్రజలకు కొంచెము కొంచెముగా బాధ్యతనిచ్చిన సరిపోవుకాలము గతించినది. సంపూర్ణముగ మార్పురాకుండ నిరోధించు ప్రయత్నములు ఫలకారులుకావు. యుద్ధపరిస్థితులను చేతతో దేశరక్షణచట్టముక్రింద సంస్థానములలో ప్రజలను యిదివరలోకన్న నిరంకుశముగా పరిపాలించుచున్నారు ఇండియా ప్రపంచసంఘటనములను గుర్తింపకుండు అజ్ఞానమే యిట్టివైఖరికి కారణము. ప్రజాప్రతినిధులపై పరిపాలనాభారముంచు నవీనరాజ్యాంగ పద్ధతులను సంస్థానాధిపతులు ప్రవేశపెట్టుట శ్రేయస్కరము. కొంతకాలమునకు ఈకర్తవ్యముకూడ ప్రాతపడి, యింకను హెచ్చయిన ఆదర్శమును మేము పెట్టుకొనవలసివచ్చును. ప్రపంచపరిస్థితి ప్రతినిమిషము మారుచున్నది.

సంపూర్ణబాధ్యతాయుత పరిపాలన, సంపూర్ణ స్వాతంత్ర్యము వీటికన్న తక్కువైనదేదియు సంస్థానప్రజల కంగీకారయోగ్యముకాదు. భారతదేశ స్వాతంత్ర్యముతోపాటు, సంస్థానములలో బాధ్యత, అధికారమును సంపాదించుటకుగాను ఎన్నికష్టములనైన నెదుర్కొనుటకు తగిన బలము, ఐకమత్యము సంస్థానప్రజలు సంపాదించుకొనవలెను."

బరోడాసంస్థాన శాసనసభఎన్నికలలో ప్రభుత్వోద్యోగులు జోక్యముకలిగించుకొనుటనుగురించి విచారణ జరుగవలెనని మరియొక తీర్మానము కోరుచున్నది.

కమిటీలో ఆరుగురు క్రొత్తసభ్యులు చేర్చుకొనబడిరి.

## భారత రాజ్యాంగ విధానమును గూర్చి త్వరలో సమాధానము

మద్రాసు గవర్నరుగారి ఉపన్యాసం

కోయంబత్తూరు, జూలై ౨

కోయంబత్తూరు కాలేజీహాలులో నిన్న సాయంకాలము బహిరంగసభ జరిగినది. ఆసభలో మదరాసు గవర్నరుగారు ఉపన్యసించిరి.

"భారతరాజ్యాంగ విధానముచాల ముఖ్యమైనవిషయము. దీనినిగురించి త్వరలోనే అందరికిని సంతృప్తికరమైన సమాధానము కలుగకతప్పదు.

హిట్లరు యిదివరకు జెకోస్లావాకియా, పోలండు, హాలండు, ఫ్రాన్సు మొదలైన దేశాలవిషయములో చేసిన వాగ్దానాలన్నిటినీ భంగపరిచినాడు. హిట్లరువాగ్దానాల కేమియువిలువలేదు. ఈ యుద్ధములో హిట్లరు బ్రిటిషువారిని జయించగలిగితే గొప్పబహుమానముగా ఇండియాను తప్పకుండా తీసుకొనును. హిట్లరు ఇండియాకు లేశమైనను స్వాతంత్ర్యము నీయడు. కాబట్టి హిట్లరుతత్వమును పూర్తిగానశింపజేయుటకు ఇండియాలో అన్నిజాతులవారును అన్నిపక్షములవారును ముఖ్యముగా యేకీభవించవలెను.

మదరాసు రాష్ట్రమిలిటరీ హజా సేనలోచేరుటకు అర్హులైనవారు చాలమందివున్నారనియు, వీరితరరాష్ట్రాలవారికి తీసిపోరనియు, మదరాసులో వెనుక సేనవుండేదనియు, దానిని మరలయేర్పాటుచేయవలెననియు, నేను గవర్నరు-జనరలుకు వ్రాసినాను అనిరి."

"నెలకు ౧౦౦ రూపాయలకంటె హెచ్చు జీతమును పుచ్చుకొను ప్రభుత్వోద్యోగులందరును ౬నెలలవరకు ప్రతినెలలోను ఒకరోజు జీతమును మనఃపూర్వకముగా యియ్యవలెనని నేను త్వరలోనే అందరికిని ఒకసర్క్యులరును, విజ్ఞాపనను పంపుదును. దీనివల్ల చాలాధనము లభించునని నేనునమ్ముచున్నాను." అనిగవర్నరు తుదకు సూచించెను.

## ఆంధ్రరాష్ట్రసిద్ధి సులభసాధ్యము కాదు

బులుసు సాంబమూర్తి గారి అనుభవము

గుంటూరు, జూన్ ౩౦

నిన్న సాయంత్రము మద్రాసు శాసనసభాధ్యక్షులైన శ్రీ బులుసుసాంబమూర్తిగారు ఈ పట్టణమునకువిచ్చేసిరి. వారికి గుంటూరు పురపాలకసంఘమువారు సన్మానపత్రము నొసంగిరి.

సన్మానపత్రమునకు సమాధాన మొసంగుచు ఆంధ్రోద్యమములోగాని, స్వరాజ్యపు పోరాటములోగాని ప్రతివ్యక్తియు ఇదివరలో చేసినదానిని చూచుకొని సంతోషించుకొను కాలముకాదనియు, చేయవలసినపని ముందరయెంతో ఉన్నదనియు హెచ్చరించెను. తనకు చూడ స్వరాజ్యసంపాదన యెంతో సులభసాధ్యమైనవిషయముకాదని తోచుచున్నదనియు, తనకీ అభిప్రాయము గత ౩సంవత్సరముల అనుభవముమీద కలిగినదనియు చెప్పిరి. స్వరాజ్యము వలెనే ఆంధ్రరాష్ట్రముకూడ మనకు యిచ్చుట నుండియో వచ్చుననియు ఎంతోయిచ్చువారలు కలరనియు. ఎవరియొక్కయో అనుగ్రహ ముండవలెననియు తలచుట వట్టిభ్రమ. మనలోనుండు ఐకమత్యము వలనను, మనపట్టుదల, కార్యదీక్ష, త్యాగశక్తి వల్లను రావలెనేగాని ఒకరిఅనుగ్రహమువల్ల వచ్చునదికాదు. అట్లువచ్చునది వారిఆగ్రహమువల్ల తిరిగిపోగలదు-అని చెప్పిరి.

(ఆంధ్రపత్రిక)

### బ్రిటిషు వారికి హోల్కారు మహారాజు ఒక విమానము ఇచ్చుట

ఇండోరు, జూలై౧.

హోల్కారుమహారాజు గారి విమానము ఒకటి యిప్పుడు లండనులోనున్నది. దీనిలో ఆరుగురు కూర్చొనుటకు స్థలమున్నది. యుద్ధసహాయ నిమిత్తము మహారాజుగారు దానిని బ్రిటీషువిమానము త్రివర్గమువారికిచ్చిరి. ఈవార్తను వీరు సెంట్రలు ఇండియా రెసిడెంటుద్వారా ఇండియా గవర్నరు జనరలుకు తెలియజేశారు.

## ఇండియాలో యుద్ధ పరిశ్రమ

౧౯౧౮ లో కన్న ఎక్కువ యుద్ధ సామగ్రి

ఫిరంగులు, మందుగుండ్లు, ఇతర యుద్ధపరికరములు సైనికదుస్తులు సుమారు ౨౦వేల రకములు ఇండియాలో ఇప్పుడు తయారగుచున్నవి. ఇండియా ప్రభుత్వంవారు అడిగిన రకములను తయారుచేయజాలకపోయినను తయారు చేసినటువంటి తప్పిన్నరకములనుకూడ ఒక్కొక్కమారు స్వీకరించుచున్నారు. అడుగునప్పుడుకూడ సాధ్యమైనంతవరకు తయారుచేయగల రకములనే అడుగుచున్నారు.

ఫిరంగుల ఫ్యాక్టరీలు గత యుద్ధము యొక్క చివర ౭నెలలలో తయారు చేసినదానికన్న ఈ యుద్ధారంభమునుండి జరిగిన ౬నెలలలో ఎక్కువగా తయారుచేయగలిగెను, గతయుద్ధాంతమున ఏర్పాట్లన్నియు, పూర్తిగా, తయారు జోరుగా కొనసాగుచుండెను. ఈ యుద్ధారంభమున తయారు కావలసిన ఏర్పాట్లు ప్రారంభింపవలసి వచ్చెను: అట్లయ్యును అప్పటికన్న ఇప్పుడు ఎక్కువ తయారగుట గొప్పవిశేషము. యుద్ధారంభమైన ౬నెలలలో ఫిరంగుల ఫ్యాక్టరీలలో సిబ్బంది అంతకుముందుకన్న రెండింతలయ్యెను. అంతకుముందు ఉన్నవి అధికారులు, ౩౬౭ మంది చిన్న అధికారులు, గుమాస్తాలు, కార్మికులు ౧౬ వేలమందిఉండిరి. యుద్ధమారంభమైనతర్వాత ౧౦౪ మంది ఉన్నతాధికారులు, ౬౨౩మంది చిన్నఅధికారులు గుమాస్తాలు, కార్మికులు ౩౫,౫౦౦మంది సిబ్బందితోపాటు తయారుకూడ హెచ్చినది.

ఫిరంగిగుండ్లు ౧౨అంతలు తయారగుచున్నవి. చిన్న తుపాకుల మందుగుండ్లు, ౨ అంతలు, రెప్లిరేటర్ల ౩అంతలు.

పర్యవేక్షణాధికారులుగను యంత్రప్రవీణులుగను పనిచేయుటకు తగినంతమంది లభించుటకై ఈపనులు చేయుటలో చాలామందికి శిక్షణనిచ్చుచున్నారు

## బొంబాయిలో నోట్లయిబ్బంది

బొంబాయిలో కరెన్సీనోట్లకు రూపాయిలుదొరికేది కష్టమైంది. ఇటీవల ఇండియాప్రభుత్వమువారు రూపాయిలనుకూడబెట్టేవారికి ౫ ఏండ్ల జెయిలుశిక్షతగులును అని శాసించినారు. అయినఉద్యోగులైనవారికినోట్లలో జీతములియ్యగా వారునోట్లను మార్పించేదానికిపోతే బజార్లలో రూపాయిలిచ్చుటలేదు అందుచేత రిజర్వుబెంకువద్ద జనులు గుంపులుగుంపులుగా మూగుచున్నారు. గుంపుచాలా పెద్దదిగా పెరుగుటచేత పోలీసువారిసహాయము అవసరమైంది.











## మ.ఘ.వ. నైజాంస్టేటురైల్వే

## నోటీసు

### ప్యాసింజరుబండ్ల రాకపోకలలో మార్పులు

10 జులై 1940 బుధవారము నుండి యీక్రిందిబండ్లు మార్పుచేయబడిన యీక్రింది కాలములలో నడచును.

నెం. 11 ప్యాసింజరు

| | | |
|---|---|---|
| కాజీపేట | పోక | 3-39 |
| సికింద్రాబాదు | రాక | 6-28 |
| | పోక | 6-38 |
| హైదరాబాదు బి.జి. | రాక | 7-06 |

నెం. 36 ప్యాసింజరు

| | | |
|---|---|---|
| సికింద్రాబాదు | పోక | 6-42 |
| హైదరాబాదు యం.జి. | రాక | 6-52 |
| | పోక | 6-57 |
| మహబూబ్ నగరం | రాక | 9-39 |
| | పోక | 9-47 |
| కర్నూలుటౌన్ | రాక | 13-16 |
| | పోక | 13-36 |
| ద్రోణాచలం | రాక | 14-50 |

35 ప్యాసింజరు / 37 ప్యాసిం

| | | 35 ప్యాసింజరు | 37 ప్యాసిం |
|---|---|---|---|
| ద్రోణాచలం | పోక | 11-05 | |
| కర్నూలుటౌన్ | రాక | 12-12 | |
| | పోక | 12-34 | |
| మహబూబ్ నగరం | రాక | 16-26 | |
| | పోక | 16-34 | 6-25 |
| హైదరాబాదు యం.జి. | రాక | 19-20 | 10-07 |
| | పోక | 19-25 | 10-10 |
| సికింద్రాబాదు | రాక | 19-45 | 10-28 |

31 ప్యాసింజరు

| | | |
|---|---|---|
| బొలారం | పోక | 5-50 |
| అల్వాల్ | ,, | 5-58 |
| సికింద్రాబాదు | రాక | 6-13 |
| | పోక | 6-23 |
| హైదరాబాదు యం.జి. | రాక | 6-40 |

పూర్తి రాకపోకల కాలములకు స్టేషన్లలోయుండు పెద్ద పట్టికలను చూడుడు.

బై ఆర్డర్

# అహింసను స్వీకరించుడు

## బ్రిటనులకు గాంధిమహాత్ముని విజ్ఞప్తి

గాంధిమహాత్ముడు ప్ర్ప్రతిబ్రిటిషువాని నుద్దేశించి ఒక దీర్ఘవిజ్ఞప్తి గావించినారు:

"ఒకదేశముతో మరియొకదేశమునకుగల సంబంధములను చక్కబెట్టుకొనుటకును, ఇతర విషయములకొఱకును యుద్ధమార్గమునువదలి అహింసామార్గమును చేపట్టవలసినదని ప్రతిబ్రిటిషువానికిని, ఎక్కడనున్నను విజ్ఞప్తి చేయుచున్నాను.

ఈయుద్ధము ప్రజాస్వామ్యవిధాన పక్షమున సాగించబడుచున్నదని మీ రాజ్యాంగనాయకులు ప్రకటించియున్నారు. ఇంకను దానిని సమర్థించుటకు ఇతరకారణము లనేకములు చెప్పబడినవి. అవియన్నియు మీకు కంఠస్థములే. మిగులబోవు ప్రజాస్వామిక రాజ్యమే యుండదు.

ఈయుద్ధము ఏవిధముగా సమాప్తమైనను, ఈ యుద్ధాంతమున ప్రజాస్వామ్యపక్షమున పనిచేయుటకు ప్రజాస్వామిక రాజ్యమేదియు నిలిచియుండదు. ఈయుద్ధము మానవులకొక చెడ్డపీడగాను, హెచ్చరికగాను దిగబడినది.

ఇంతవరకెన్నడు గాని లేనంత ఎక్కువగా యీయుద్ధము మానవుని పశువునుగా చేయుచుండుటచే యిదియొక పీడ. యుద్ధము చేయుచున్నవారు చేయనివారుఅను భేదము అన్నియు త్రోసివేయబడినవి. ఎవరినిగాని, దేనిని గాని వదలుటలేదు.

అసత్యము ఒకకళయైనది. బ్రిటను చిన్న దేశములను రక్షించదలచెను. అవి ఒకదానివెంటనొకటి అధమపక్షము ఇప్పటికైనను లేకుండపోయినవి.

ఇదియొక హెచ్చరికకూడ యనవచ్చును. ఈ సూచనను ఎవరును గమనించనిచో, మనుష్యుడు పశువులప్రవర్తనల ననుకరించుచు దాని స్థితికేరాగల అ హెచ్చరిక.

యుద్ధము ప్రారంభమైనపుడు నేనీరహస్యమును కనుగొంటిని. కాని అప్పుడొక మాటయైనను చెప్పుటకు నాకు ధైర్యములేకపోయెను. కాలము మించిపోకముందే ఆమాట చెప్పుటకు భగవంతుడు నాకిపుడు ధైర్యమిచ్చినాడు.

### వైరము మానుడు

వైరములను మానవలసినదని నా ప్రార్థన. నేనిట్లు ప్రార్థించుట మీరు యుద్ధములో చాల ఎక్కువగా అలసియున్నారనికాదు. ఈ యుద్ధము అసలు చెడుది.

### నాజీతత్వానికి తగిన ప్రతిక్రియ

నాజీతత్వమును మీరు చంపజాలరు. అతత్వమును నిర్లక్ష్యముగా అనుసరించుట వలన అది చావదు.

జర్మనుసైనికులు చేయుచున్న వినాశకార్యమునే మీసైనికులును చేయుచున్నారు. భేదమేమనగా మీపని జర్మనులపనియంత సంపూర్ణము గలేదు.

అది నిజమేయైనట్లయిన, మీపనికూడ త్వరలో వారల పనికంటె ఎక్కువ పరిపూర్ణతను సాధించజాలకున్నను. దానియంతటి పరిపూర్ణమైనను కాగలదు. ఇంకొకవిధముగా యుద్ధములో మీరు జయింపజాలరు.

అనగా, మీరు నాజీలకంటె ఎక్కువ క్రూరులు కావలెను. ఎంతటి న్యాయపక్షమునకైనను ఇప్పటివలె నిమిషనిమిషమునకు వివేకములేని హత్యలు సమర్థనీయములు కావు.

నేను చేయబడుచున్న క్రౌర్యముం చేయవలసినఅవసరమున్నచో, అట్టిపక్షము న్యాయపక్షముకాదని సూచన.

### అహింసను చేపట్టుడు.

మీభుజశౌర్యము నిరూపితమైన సంగతియే. మీభుజమువలెనే మీమనస్సుకూడ నిరుపమానమైన వినాశసామర్థ్యము కలదని చూపించవలసిన అవసరము మీకున్నదా! నాజీలతో ఇట్టినీచమైనపోటీకి మీరుదిగకున్న బాగుండునని నాఆశ.

మీకు మరియొక ఉదారతమైనట్టియు, ధీరతమైనట్టియు మార్గమును సూచించుటకు రసాహసించుచున్నాను మీరు నిరాయుధులై నాజీలతో పోరాడవలసినదని నాకోరిక. అనగ నైనికపరిభాషలో అహింసాయుధముతో పోరాడవలెనని తాత్పర్యము.

మీకున్న ఆయుధములు మిమ్ములను గాని మానవులను గాని రక్షించజాలవనితలచి వాటిని మీరు వదలివేయవలెనని కోరుచున్నాను. మీరు మీపని చెప్పుచున్న రాజ్యాలలో ఏవికావలెనో అది తీసికొనవలసినదని హిట్లరు, ముసోలినిగార్లను మీరు ఆహ్వానించగలరు.

మనోహరమైన మీదీవిని, అనేక మనోహర భవనములతోసహా వాండ్లను తీసికొననిండు. వీటినన్నిటిని మీరీయగలరు. కాని మీఆత్మలను గాని, మనస్సులను గాని యివ్వరు.

ఈ పెద్దమనుష్యులు మీదేశములను ఆక్రమింపగోరుచో, మీరు అక్కడినుండి లేచిపోయెదరు. మిమ్ములను అట్లు లేచిపోనీయనిచో, ప్రతిపురుషుడు ప్రతిస్త్రీయు, ప్రతిశిశువున్ను వారలు చంపినను ఒప్పుకొందురుగాని వారలకులోబడుటను మాత్రము నిరాకరింతురు.

ఈ వివాదపరిష్కార పద్ధతిని నేను అహింసయనియు, సహాయనిరాకరణమనియు అంటిని. భారతదేశములో దీనిఉపయోగమువల్ల గొప్ప ప్రయోజనము లేకపోలేదు. భారతదేశములోనున్న మీప్రతినిధులు నేనుచెప్పినదానిని కాదనవచ్చును. అట్లునైనచో వారినిగూర్చి నాకు విచారముకల్గును. మాసహాయ నిరాకరణము సంపూర్ణముగా అహింసాపూరితముగ లేకుండెననియు, అదిద్వేష జనితమైనదనియు వారలు చెప్పవచ్చును. వారలావిధముగ చెప్పుచో, నేనుకాదనను. అదిసంపూర్ణముగా దౌర్జన్యరహితమైయుండినచో, సహాయము నిరాకరించినవారలందరును మీయెడ ప్రేమపూరితులైయుండినచో, భారతదేశమునకు ప్రభువులగుమీరు భారతదేశమువద్ద విద్యార్థులైయుందురు, మరియునాకంటెఎక్కువనేర్పుతో ఈ నిరుపమానమైన ఆయుధమును మెరుగుపెట్టి జర్మనీ, ఇటలీమిత్రులవలని ఉపద్రవమును అహింసాయుధముతో నెదుర్కొనియుందురు.

ఇంతేయేల అపుడు దేశములచరిత్రయంతయు వేరేవిధముగా వ్రాయబడియుండెడిది. యూరోపులో నిరపరాధులరక్తము సముద్రమువలె ప్రవహింపజేయబడకుండెడిది. చిన్నదేశములనేకములు అపహరించబడకుండెడివి, ద్వేషోన్మత్తతాండవము లేకుండెడిది.

### అపజయమునెరుగని అహింస

ఈ ప్రార్థనను నేను నాపద్ధతి తెలుసుకొని చేయుటలేదు. నేను ౫౦ సంవత్సరకాలమునుండి నిరంతరముగా అహింసను, సైన్సులో పాటించునంత సూక్ష్మపరిమాణమునుకూడ పోనీయకుండ, ఆచరించుచున్నాను. నేనుదీనిని గృహకార్యములు సంస్థలకార్యములు, ఆర్థికకార్యములు, రాజకీయకార్యములు మున్నగు అన్నివిషయముల పనులలోను ఆచరించిచూచినాను. ఒక్కసారియైనను అది నిష్ప్రయోజనమైన సందర్భము నేనెరుగను ఒకొక్కప్పుడు అదినిష్ప్రయోజనమైనట్లు కనపడినపుడుకూడ, అది నాలోపమువల్లనేయని తలచినాను. నేనైనను అన్నివిధముల పరిపూర్ణుడనని చెప్పుకొనను. కాని నేనుసత్యమును చాలశ్రద్ధతో శోధించువాడనని చెప్పుకొనగలను సత్యమనునది భగవంతునికే మరియొకపేరు. ఆపరిశోధనలోనే నాకు అహింసగోచరించినది. ఈ పరమానిధిచెప్పు నాకు జీవితార్థమేదియు లేదు.

నేను బ్రిటిషుప్రజలకు స్వార్థమువాంఛించని ప్రాణమిత్రుడనుగా నుంటినని చెప్పుకొనగలను. ఒకప్పుడు నేనుమీసామ్రాజ్యమునుకూడ ప్రేమించుచుంటిని అదిఅప్పుడు భారతదేశమునకు మేలుచేయుచుండెనని నేను తలచియుంటిని, ఆ సామ్రాజ్యముయొక్క స్వభావమే మేలుచేయునట్టిదికాదని నాకుకనపడగా, సామ్రాజ్యతత్వముతో పోరాడుటకై నేనుఅహింసనుపయోగించితిని, ఇప్పటికిని ఉపయోగించుచున్నాను. నాదేశముయొక్కగతి అఖరుకు ఏమైనను, మీపై నాప్రేమ అట్లేయున్నది. ఏమాత్రము తగ్గకయుండగలదు. నాఅహింసప్రకారము నేనుఅందరియెడ ప్రేమగలిగియుండవలెను. అందరిలో మీరుకొద్దిభాగముకారు. ఆప్రేమవల్లనే నేను మీకు ఈవిజ్ఞప్తిగావించినాను.

భగవంతుడు నాప్రతిమాటకును శక్తినిచ్చుగాక. ఆయనపేరనే నేనుదీనిని వ్రాయబూనినాను. ఆయనపేరనే ముగించుచున్నాను. మీ రాజ్యాంగనాయకులలో చాలమందికి నావి

నావిజ్ఞప్తియొక్క ప్రయోజనమును సాధించుటకు నాసహాయమువల్ల ప్రయోజనముండునని సార్వభౌముని ప్రభుత్వమువారు తలచుచో, అందుకు నేనుసిద్ధముఅని వైస్రాయిగారికి నేను తెల్పుచున్నాను." అని మహాత్ముడు విజ్ఞప్తి చేయుచున్నాడు.

---

# ఫ్రెంచి సామ్రాజ్యము

## అన్ని సముద్రాలలోను వారి సామంతరాజ్యాలే

ఫ్రెంచిదేశము అధీనములో ఉండేదేశాలకు పరిమితియే లేదు. ఇంగ్లీషువారి సామ్రాజ్యముతర్వాత పెద్దసామ్రాజ్యము ఫ్రెంచివారిదే. పంచఖండాలలో ప్రతిఖండములోను వారికిలోబడిన దేశాలుకలవు. అనేకద్వీపాలు అన్ని సముద్రాలలోను వారియధీనములోనున్నవి. ఫ్రాన్సుదేశము మొన్న జర్మనీకి లోబడిందంటే దాని సామ్రాజ్యానికెంత గొప్పదెబ్బకలిగిందో ఊహించుకొనే దానికికూడా శక్యం గాదు. ఫ్రాన్సుకులోబడిన దేశాలను జర్మనీవారులాగుకుంటే, ఫ్రాన్సు యిక యెందుకుపనికిరాని అధ్వాన్నదేశమై దిక్కులేని స్థితి కూటికిగుడ్డకు గతిలేనిదగును. ఫ్రాన్సుదేశమునకు లోపడినదేశాలపట్టిక ఈక్రింద చూపించబడుతుంది.

యూరోపుఖండములో

౧. ఫ్రాన్సు-స్వదేశము-వైశాల్యము ౨౧౨౭౦౬ చదరపుమైళ్లు (చ. మై.)]
౨. కార్సికాద్వీపము- మధ్యధరా సముద్రములో వైశాల్యం-౩౬౦౨ చ. మై.

ఏషియాఖండములో

ఇండియాలో
(౧) పుదుచ్చేరిపట్నం-మద్రాసుకుదక్షిణం
(౨) చంద్రనగోర్ పట్నం- కలకత్తావద్ద
(౩) కరికాల్ (కావేరీ డెల్టావద్ద)
(౪) యానాం (గోదావరి డెల్టావద్ద)
మొత్తంవైశాల్యం ౨౦౦ చ. మై.

చీనాలో

ఇండోచీనా ఇది అయిదుభాగాలు
(౧) కొచిన్-చీనా వైశాల్యం-౨౪౦౦౦ చ మై.
(౨) కాంబోడియా ,, ౩౦,౦౦౦ ,,
(౩) అనాం ,, ౫౧౦౦౦ ,,
(౪) టాంకిన్ ,, ౪౬౦౦౦ ,,
(౫) లోస్ ,, ౧౦౦,౦౦౦ ,,
క్వాంగ్చూవాన్ ,, ౨౫౦ ,,
సిరియా ,, ౬౦,౦౦౦ ,,

అమెరికాఖండములో

చిన్నచిన్న ద్వీపాలు చాలాఉన్నవి, అన్నిటివైశాల్యము ౩౫౩౨౦ ,,

ఆస్ట్రేలియాఖండములో

కలడోనియా- వైశాల్యం ౭౨౦౦ ,,
ఇతర చిన్నచిన్నద్వీపాలు ,, ౧౧౫౦ ,,

ఆఫ్రికాఖండములో

అల్జీరియా వైశాల్యం ౨౨౨౧౨౦ ,,
మొరాకో ,, ౨౩౦౨౧౦ ,,
ట్యూనిస్ ,, ౪౮౦౦౦ ,,
ఫ్రెంచిఆఫ్రికా ఫెడరేషన్ అను పేరుతో నున్న భాగాలు వైశాల్యం ౧౮౯౯౧౫౯ ,,
టోగాలాండువగైరా,, ౨౦౪౬౪ ,,
మధ్య ఆఫ్రికా ,, ౭ లక్షల ,,
తూర్పుఆఫ్రికాలోని సోమాలీలాండు ,, ౯౦౦౦ ,,
మడగాస్కర్ ద్వీపము,, ౨౨౭౦౦౦ ,,

ఇవిగాక ఇంకను కొన్ని చిన్నచిన్న ద్వీపాలును కలవు.

## హిట్లరు ఆలోచనలు తారుమారైనవి

జ్యూరిచ్, జూలై ౧

జోర్కూరు జీటాంగుపత్రికయొక్క బర్లిను విలేఖరి ఆపత్రికకు ఈక్రిందివార్త పంపెను,

బాల్టికురాజ్యము లపై రష్యా దాడిసల్పినప్పుడు బర్లినులో యెట్టి ఆందోళనగాని కనుపడలేదు. కాని బెసరేబియాపై రష్యాసేనలు దాడివెడలగానే నాజీనాయకులు తీవ్రముగు ఆందోళనకు గురియైరి. రష్యాచర్య జర్మనీకిసంభ్రమాశ్చర్యములను కలుగజేసినది, ఈసమయముననే రుమేనియా రాజ్యభాగములవిషయమై హంగేరి బల్గేరియా ప్రభుత్వములు తమ కోరికలను తెలుపుట, యితరరాజ్యములదాడిని ప్రతిఘటించ రుమేనియాలో సైనిక సమీకరణపు ఉత్తరువులు ప్రకటింపబడుట, నల్లసముద్రములోని రేవులను ఆక్రమించుకొన రష్యా ప్రయత్నించుచున్నదనువార్తలన్నిటినిచూడ బాల్కనురాజ్యములలో శాంతి అంతమొంది తీవ్రముగు సంచలనము ప్రారంభమైనట్లు స్పష్టమగుచున్నది. పశ్చిమ ఐరోపాలో తన ప్రణాళికల నన్నిటిని చక్కబెట్టుకొనువరకు బాల్కను రాజ్యములలో ఎట్టిసంచలనము ఏర్పడకూడదనియు, పశ్చిమ ఐరోపావ్యవహారము ముగిసినపిమ్మట బాల్కనురాజ్యముల భవిష్యత్తు నిర్ణయింపవలయుననియు హిట్లరు ఉద్దేశించియుండెను. కాని రష్యా యీచర్యలవల్ల హిట్లరు ఉద్దేశ్యములు తారుమారైనవి.

## రా. బ. జి. సుబ్బారెడ్డిగారి నిర్యాణము

కడపజిల్లా రాయచోటి తాలూకా గాలివేడు వాస్తవ్యులును సేలంజిల్లాలో ఆడిషనల్ జిల్లా మేజస్ట్రీటుగనున్నవారునగు శ్రీ గాలివేడు సుబ్బారెడ్డి బి, ఏ. గారు రాచపుండువలన తమ ౫౩వ యేట మదరాసు నగరమున నరసింగ హోమ్‌లో ౨౫-౬ ౧౯౪౦ తేదిని చనిపోయినారన్న దుఃఖవార్త తెలుప చింతిల్లుచున్నారము. వీరు ౧౯౨౧ నుండి డెప్యూటీ కలెక్టరుగ నున్నారు, ౫ సంవత్సరములు బొబ్బిలి సంస్థాన దివానుగ పనిచేసిరి. వీరిని ౧౯౩౦లో రావుబహదరు బిరుదముచే ప్రభుత్వమువారు బహూకరించిరి. వీరు గొప్పపదవులలోనున్నను చిరాకునొందక నెమ్మదిగ ఉద్యోగనిర్వహణ మొనరించుచుండెడివారు. బీదసాదల కేసులకు న్యాయమార్గమున నుపకార మొనరించుచుండెడివారు. కులాభిమానులు, నిరాడంబరులు. వీరికి ఇద్దరు సోదరులుకలరు. ఒకరు గాలివేడు గ్రామ మునసబుగ నున్నారు. రెండవవారు నాగిరెడ్డి బి. ఏ. బి. ఎల్. గారు విజయనగరమున డిస్ట్రిక్టు మునసబుగనున్నారు. వీరికి ఇద్దరుసోదరీమణులు, ఎనమండుగురు పుత్రులు యిద్దరు పుత్రికలు, భార్య కలరు. వీరి పుత్రులలో మొదటి ఇద్దరు పట్టభద్రులై యున్నారు.

(రెడ్డి రాణి)

## హె.ఘు.వ. నిజాంస్టేటురైల్వే

మ్యూరెక్కు ఎలక్ట్రిక్ వెల్డింగ్ ప్రోసెస్‌పైన నైపుణ్యముతో పనిచేయగల వెల్డర్ కావలయును. ఫ్యాబ్రికేటెడ్ మైల్డుస్టీల్ స్ట్రక్చర్లు, క్యాస్టుఐరన్, క్యాస్టుస్టీలులను వెల్డింగుచేయగల్గియు, చెడిపోయిన రైల్వేపాయింట్లు, క్రాసింగులు దురస్తుచేయు నేర్పును గల్గియుండవలయును.

అనుభవము, అర్హతలనుబట్టి వేతనము నిర్ణయింపబడును.

హ. ఘు. వ. నిజాంరాష్ట్ర ముల్కీలకు ప్రాముఖ్యత యివ్వబడును.

దరఖాస్తులు హ. ఘు. వ. నిజాంస్టేటురైల్వే, లేబర్ ఆఫీసుకార్యాలయము సికింద్రాబాదునందు దొరకు ప్రత్యేకఫారములపై 10 జూలై 1940 తేదికి మించకుండా పంపవలయును.

సికింద్రాబాదు
1 జూలై 1940.

ఎ. హెచ్. బర్నెట్,
లేబర్ ఆఫీసర్.

## కూలీల జీతాలనుండి యుద్ధపు అప్పులకు సహాయము

### వైస్రాయిగారి క్రొత్త ఆర్డినెన్సు

ఇదివరలో కూలీలజీతాలను సరిగాచెల్లించే ఏర్పాట్లకొరకై ఇండియా ప్రభుత్వమువారు ఒక శాసనము చేసియుండిరికదా! ఇపుడు యుద్ధానికి అవసరమైన ద్రవ్యముకొరకు ఇండియా ప్రభుత్వమువారు కోరినఅప్పులలోకి కూలీలజీతాలనుండి ఏమైనమొత్తాలను చెల్లించదలచినచో ఆ మొత్తాలను బిగపట్టుకొని తక్కినజీతాలను మాత్రమే ఇచ్చుటకు కార్ఖానాలున్నగు సంస్థలయజమానులకు అధికారముండునట్లుచేయుటకై సదరుశాసనమును తగురీతిగాసవరించు ఒకఆర్డినెన్సును వైస్రాయిగారు జారీచేసినారు.

## గతయుద్ధ విశేషాలు

క్రీ. శ. ౧౯౧౪ నుండి ౧౯౧౮ వరకు ఇంగ్లీషువారును ఫ్రెంచివారును, ఇటలీవారును, రష్యావారును ఒకప్రక్కనున్ను జర్మనీ, టర్కీ ఒకప్రక్కనున్ను యుద్ధముచేసిరి. అప్పటి కొన్ని విశేషాలను "అమృతబజారు" పత్రికలో ఇట్లు ప్రకటించినారు.

యుద్ధప్రారంభము ౧ ఆగస్టు ౧౯౧౪
యుద్ధవిరామము ౧౧ నవంబరు ౧౯౧౮
యుద్ధకాలము ౪ ఏండ్లు ౩ నెలలు ౧౧ దినాలు
అమెరికా యుద్ధములోచేరుట ౬ ఏప్రెల్ ౧౯౧౭
ప్యారిసులో సంధిసభ ౧౮ జనవరి ౧౯౧౯
జర్మనీలో సంధిసభ పూర్తియగుట ౨౮ జూన్ ౧౯౧౯
యుద్ధములో చేరిన దేశాల సంఖ్య ౩౪ లక్షల ౫౦ వేల ౨౦౦
యుద్ధములో అందరికిని అయిన ఖర్చు ౧౮౬,౦౦౦,౦౦౦,౦౦౦ డాలర్లు

అనగా డాలరు ఒకటింటికి మూడున్నరకల్ల రూపాయీలప్రకారము లెక్కవేస్తే౬౫వేల కోట్ల రూపాయీలు. ప్రసిద్ధిగాంచిన వర్సేల్సు సంధి ౨౮ జూన్ ౧౯౧౯,

## ఒకలక్ష దేశరక్షకదళము

### సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుతీర్మానము

లక్నో, జూలై ౭

సంయుక్తరాష్ట్ర గ్రామములయందును పట్టణములయందును దాదాపు లక్షమందితోగూడిన జాతీయరక్షణదళము నేర్పరచుటకు ఆరాష్ట్ర కాంగ్రెసుసంఘముయొక్క వాలంటీరు బోర్డువారు తీర్మానించిరి. దేశరక్షణమునకై సేవచేయుటకు గాఢముగా వాంఛించువారును, శాంతిభద్రతలను కాపాడ వాంఛించువారును, ఈ దళములోనుందురు. ఈ విధానమునకు దాదాపు ౨౫లక్షలరూపాయలు వ్యయమగును. ఇంతవరకు వాలంటీర్లను శిక్షణచేయుటకుమాత్రము బోర్డువారు శ్రద్ధవహించుచుండిరి. ఈపద్ధతిలో మార్పుచేయవలెనని బోర్డువారుతలచిరి దేశమునందలి యువకులశిక్షణకై తీవ్రయత్నములు చేయుటకు సభవారుతీర్మానించిరి. కాంగ్రెసువాయకత్వమునందు నమ్మకముగలవారినందరిని కలియదీసికొనిపోవుట అవసరమని తలచిరి.



## జవాహర్లాలుగారి ప్రతినిధి

### హైదరాబాదుకు వచ్చినారు

ఏ. పి. వార్తగాడు జులై ౭వ నాడు ఇట్లు వ్రాసినారు.

పండిత ద్వారకానాథ కట్జూ కష్మీరీ అను వారిని హైదరాబాదు సమస్యలను తెలుసుకొని ఒక నివేదిక సిద్ధపరచుటకై పండిత జవాహర్లాలు నెహ్రూగారు పంపినారు. వారునిన్న హైద్రాబాదుచేరినారు. వీరు ఇచ్చట ఇంచుమించు ఒకనెలవరకుందురు. ప్రతిరాజకీయ పార్టీవారితోను అధికారులతోను కలియుదురు.

రేపు పైపండితుగారు నవాబు బహద్దరుయార్జంగు బహద్దరుగారితోను జాతీయ ప్రజకులైన ముసల్మానులతో మంగళవారము నాడును కలియగలరు. గ్రామపరిస్థితులను తెలుసుకొనుటకై పండితుగారు కొన్ని గ్రామాలలో పర్యటనచేయుదురు.

పండితుగారు ఒకపెద్ద ప్రశ్నాపట్టికను వ్రాసి తీసుకొనివచ్చినారనియు తెలియుచున్నది.

## పురాతనపశువైద్య గ్రంథము

### ౨౦౦౦ యేండ్లనాటి ప్రతిదొరుకుట

సిమ్లా, జూలై ౧

భారతదేశమున ౨౦౦౦ యేండ్లక్రిందటికాలమునాటి పశువైద్యగ్రంథమొకటి వ్యవసాయ పరిశోధనమండలి ప్రత్యేకోద్యోగి పరిశోధనమూలమున లభించెను. భారతదేశమున అనాదినుండి పశువులరోగాలకు దేశీయపద్ధతిప్రకారము కొందరు పశువైద్యులు చికిత్స నొసగుచుండుట వాడుకైయున్నది. కాని అట్టివైద్యులు పరంపరగా వైద్యముచేయుచున్నారేగాని, ఈ పురాతనగ్రంథములోనిజ్ఞానము వారికి తెలియదు. పూర్వకాలపు భారతీయ పశువైద్యులు తమచికిత్సాపద్ధతులను, మందులను రహస్యముగా నుంచుకొనెడివారు. పైతెలుపబడిన పురాతనగ్రంథము చోటికిందున అది చాలా ఉపయోగకరముగా నుండగలదనియెంచు, దానివిషయమై పూర్తిగా పరిశోధనలు జరుపుటకు విశ్వవిద్యాలయముల పరిశోధన నిపుణులు వ్యవసాయపరిశోధన సలహాసంఘము నియోగించుటకు నిశ్చయించెను. ఆగ్రంథముగ్రాతప్రతిలోని ఓషధులు శాస్త్రీయముగా పరీక్షింపవలెనని సంఘమువారి ఉద్దేశ్యము. ఈ కార్యమునకు విద్యాపీఠము పరిశోధకులకు బోర్డు ధనమొసగును.

నేతిలోని కల్తీనితీయుటకు సులభముగా తెలిసికొనుటకు పరిణాలికమంజూరు చేయుబడినది.

## రుమేనియా రష్యాకు లొంగినకారణము

### రుమేనియా విదేశాంగ మంత్రి ప్రకటన

రుమేనియా విదేశాంగమంత్రి జూలై ౩వతేదిన రేడియోద్వారా తమదేశము రష్యాకోరికనుతీర్చుటకై బెసరేబియాను ఏలనుఇయ్యవలసి వచ్చెనో తెలిపిరి,

లొంగకుండా యుద్ధమునకు పూనినచో ఈశాన్యదిశనుండి రుమేనియా సేనాబలమును సంఖ్యలోమించిన రష్యాసేనల నెదుర్కొనవలసియుండును ఈచిక్కుచూచి, ఇతరదిశల సరిహద్దులు దాటివేరేదేశములు (హంగరీ బల్గేరియాలని మనస్సులోఉన్నసంగతి) దండెత్తిరావను అభయము లేకుండెను, కాబట్టి రష్యా కోరికనిచ్చివేసినను ఇతరదేశముల దండయాత్రలనైన తప్పించుకొనవచ్చునుకదాయని బెసరేబియాను ఇచ్చివేసితిమని ఆమంత్రిగారు తెలిపిరి. (ఇతరదేశములగు హంగరీ. బల్గేరియాలు చిన్నదేశములు. అవికూడ రుమేనియానుండి ఏవోకొన్నిప్రదేశములను ఆశించుచున్నవి. ఈప్రదేశములను ఇవ్వకుండ, చిన్నదేశములుకాబట్టి వాటి సేనలనెదుర్కొనుట సులభమైనవిషయముఅని ఆమంత్రిగారిభావము.)

## పెట్రోలు ధర హెచ్చింపు

ఇండియాప్రభుత్వమువారు జూలైనుండి పెట్రోలుధర గ్యాలను ౧కి ఒకఅణావంతున హెచ్చించినారు, బర్మాలో పెట్రోలు తయారుచేయుటకగు ఖర్చు హెచ్చుటచే యిట్లుచేయబడినదట.

## ప్రపంచములోకెల్ల పెద్దవిమానము

### అమెరికాలో నిర్మాణము

అమెరికాలో బాల్టిమోరులో గ్లెనామార్టిన్ కంపెనీవారు ప్రపంచములోకెల్ల పెద్దదనితలచబడు ఒకవిమానమును నిర్మింపజేయుచున్నారట, దానిని కాలిఫోర్నియా, జపానులమధ్య ఎక్కడగాని నిలువకుండ సముద్రమునుదాటుటకు ఉపయోగించవలెనని ఉద్దేశ్యము. చుకొనగలదు. ఇది గంట ౧కి ౨౫౦ మైళ్ల వేగముతో పోవును. ౩౦ టన్నులబరువును ఇది మోయగలదట.

## 'కలకత్తా చీకటిగది'ని గూర్చిన ఆందోళన

కలకత్తానగరములో బెంగాలు ప్రభుత్వమువారి వివిధశాఖలకార్యదర్శుల కార్యాలయముసమీపమందు. కలకత్తాచీకటిగది" జ్ఞాపికగానుంచబడిన "హాల్వెల్ మాన్యుమెంటు"ను తీసివేయవలసినదని సుభాషచంద్రబోసు గారు బెంగాలు ప్రభుత్వమువారిని కోరియుండినసంగతిని ఇదివరలో చూచియుంటిమికదా! అట్లు ప్రభుత్వమువారు ౧౯౪౦ జూలై ౩వతేదిలోగా తీసివేయనిచో తామే ఈవిషయంలో స్వయంగా శ్రద్ధతీసుకొందుమనికూడ అనోటీసులో హెచ్చరించికూడయుండిరి.

దీనికి ప్రధానమంత్రి ఫజ్లుహక్ గారు జూలై ౧వతేదినాటిరాత్రి ఒకప్రకటనలో ఈనెలఆఖరులోగా ప్రభుత్వమువారి తీర్మానాన్ని తేల్చగలము కాబట్టి ఈలోగా అల్లరులు చేయవద్దనికోరిరి.

అందుపమరల సుభాష్‌చంద్రబోసు గారు ఆదేరోజు సమాధానమిచ్చినారు. అందువారు తమ నిశ్చయమును మార్చుకొనజాలమనినారు. జూను ౧౫వతేదినాడే తానుమొదటినోటీసు నంపజేసియుండుటవల్ల బెంగాలు ప్రభుత్వమువారిఆలోచనకు తగినవ్యవధియుండెననియు, ఇపుడు ౨౪ గంటలలో తమనిర్ణయము తేల్పవచ్చుననియు చెప్పినారు కాబట్టి జూలై ౩వ తేదినాడు తమనిర్ణతకార్యక్రమము అమలు జరుగక తప్పదనినారు.

రెండు గంటల గడియారములో కొట్టుసరికల్లా కలకత్తా స్పెషల్ బ్రాంచి పోలీసు డిప్యూటీ కమిషనరు ఇద్దరిపోలీసులతో బోసుగారిఇంటికివచ్చి, బోసుగారిని అరెస్టుచేసి అలీపూరులో ప్రెసిడెన్సీ జెయిలులో చేర్చిరి.

## బ్యాంకునోట్లను తక్కువఖరీదుకు కొనుట

### వడ్డీవ్యాపారులుచేస్తున్న కుతంత్రాలు

సిమ్లా, జూలై ౧

చాల రాష్ట్రములలో ఋణబాధనివారణచట్టాలు అమోదించబడినందున యిప్పుడు వడ్డీవ్యాపారులు మునుపటివలె వడ్డీవ్యాపారము చేయుటలేకున్నది. అందువల్ల వీరుతిమయేజెంట్లను గ్రామాలకుపంపించి గ్రామాలలో అమాయకులైన ప్రజలకు అబద్ధమైనవార్తలను తెలుపుచున్నారు. త్వరలోనే జర్మనీవారు ఇండియాను జయింతురు, అప్పుడు యీబ్యాంకినోట్లు చెల్లవుఅని వీరు ప్రజలకు బోధించుచున్నారు. వీరు కరెన్సీ ఆఫీసులలోనుంచి యింక పెద్దపెద్ద ఖజానాలలోనుంచియు రూపాయలు మొదలయిన నాణ్యములను మిక్కిలి విస్తారముగా తీసుకొని తమఏజెంట్లకిచ్చి వారిని గ్రామాలకు పంపుచున్నారు, మీవద్దవున్న బ్యాంకినోట్లను చిత్తుకాగితాలతో సమానమైపోవునుగనుక కొంతధరతగ్గించి మాకమ్మివేయండి అని యీఏజెంట్లు చెప్పుచున్నారు. వీరి దొంగమాటలునమ్మి కొందరు తమవద్దవున్ననోట్లను తక్కువధరలకు వీరికిఅమ్మి నగదుపుచ్చుకొనుచున్నారు! ఈ వడ్డీవ్యాపారులు మరల యీనోట్లను కరెన్సీ ఆఫీసులలోను ట్రెజరీలలోనుయిచ్చి రూపాయలను తీసుకొనుచున్నారు ఇట్లు వీరొకక్రొత్తవ్యాపారమును ప్రారంభించినారు. కరెన్సీఆఫీసులలో నోట్లను విస్తారముగమార్చి రూపాయలను తీసుకొనుటకూడ నేరమేఅని ప్రభుత్వమువారిమధ్య ప్రకటించుటవల్ల యీమోసగాండ్రకు కొంతనిరోధము కలిగినది. వీరిలో కొందరికి శిక్షలైనవి.

సంవత్సరము చందా
౬ పాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

**Volume 15** **Hyderabad-Dn.** **Monday 8 July 1940** **Number 19**

## బిదరు ఖూనీవిచారణ ముగిసినది

బస్వంతరావు వకీలును బిదరు అల్లరులలో చంపిన నేరాన కొందరు ముసల్మానులు పట్టుబడి విచారణజరిగెను. ఉభయసాక్ష్యములు పూర్తియయ్యెను. గతవారము ఉభయవకీళ్లు తుదివాదము ను పూర్తిచేసిరి. నిందితుల వకీలిట్లు వాదించెను. ఈకేసు అబద్ధము. కేసుజరిగిన కొన్నిదినాలవరకు చాలామందికాలేదు సాక్ష్యులు ౪-౫దినాలతర్వాత నిందితుల పేరుచెప్పిరి. అంతకుపూర్వ మెందుకో తెలుపలేదు. సాక్షులందరు ఒకేమతమువారు" దీనికిజవాబుగా పోలీసుపక్షాన ఇట్లువాదింపబడెను "అల్లరులకాలములో ఎట్లయినా ఆలస్యమే అగును. పైగాఅప్పుడు గరశ్రవ మాత్రముండెను జనులు భీతహులుగానుండిరి. అల్లరులలో పోలీసులకు చాలాపనియుండెను. అందుచేత చాలా ను ఆలస్యమైనా సాక్షులు ఆలస్యముగావచ్చిన అవి చిల్లరలోపాలు. కేసులో లోపముండ నేరదు. దానికితగినతీర్పు ఆధారాలుకూడా ఉన్నవి" అని వాదించెను. న్యాయాధికారి ఉభయవాదము లు విన్నారు. తీర్పుఇంకాచెప్పలేదు.

## న్యాయశాఖామంత్రి

హైదరాబాదు(దక్కను)అమర్దాదు ౩౦. ౩౧ అమర్దాదువాడు గౌ॥ సయ్యదు అబ్దుల జీజు-హైద్రాబాదు న్యాయశాఖా మంత్రిగారు సాయంత్రపుబండిలో ఆకస్మాత్తుగా బొంబాయి వెళ్ళినారు. (ద. న్యూస్)

## ఒకదినం జీతం

హైదరాబాదు[దక్కను] అమర్దాదు౩౧ సికింద్రాబాదు కంటోన్మెంటు అధికారి తన కచ్చేరీలోని ఉద్యోగులనందరిని యుద్ధ సహాయార్థము ప్రతివాడును తమజీతములలో ఒకదినము జీతమియ్యవలసినదని కోరినాడు.

## ఖాక్సారు విద్యార్థికి ఉరిశిక్ష

సర్దారుఖాన్ మహమ్మద్ అహమద్ఖాన్ అను సయాల్కోట నగరములోని విద్యార్థులు సర్దారుసింగుఅను రైల్వేపోలీసు ఉద్యోగిని చంపిననేరము విచారింపబడిరి. రైలుబండి నడచుచుండగ దాటి యాస్టేషన్ సమీపములో ఈహత్య జరిగెను. నేరము ఋజువయ్యెను. సర్దారుఖాన్ అనువిద్యార్థికి ఉరిశిక్షయున్ను రెండవానికి బలవంతముగా దొంగతనముమాత్రమే చేసెనను నేరములో ౫ ఏండ్ల జెయిలుకఠినశిక్షయున్ను విధింపబడెను. శిక్షను వినిపించుచు న్యాయాధికారి ఈనేరానికి కారణము అల్పమైనదనియు తెలిపెను. నిందితులు జాన్సిలో తమపైకొన్నంతయు వ్యయముచేసిరి. తర్వాత పైకొన్ని సంపాదించుటకే నేరాన్ని చేసిరి.

ఈకార్యముఅంతఘోరమైనది. సర్దారుఖాన్ ౨౧ ఏండ్ల చిన్నవాడైనను నేరముయొక్క వైచిత్రమునుబట్టి ఉరిశిక్షయే అర్హమనిఅని న్యాయపతి విధించెను.

## విచిత్ర ప్రకృతి

ఒక విచిత్రప్రకృతిగల మనిషి వాడీస్టేషనులో కనబడినాడు. అతని లక్షణాలు అనుమానస్పదంగాఉంటే రైల్వేపోలీసువారు అతన్ని సమీపించి-నీపేరేమి నీఊరేది ఎక్కడికిపోతున్నావు, అని విచారించినారు జవాబులేదు. అనుమానంతో పట్టుకున్నారు. సికింద్రాబాదు కోర్టు మేజిస్ట్రేటు అగు స్మిత్తుగారియెదుట పట్టుకొనివచ్చి నిలబెట్టినారు. అచ్చటకూడ ఇదేవిధంగా వర్తించినాడు. నీపేరేమిఅంటే ప్రత్యుత్తరములేదు. మీనాయినపేరేమి అంటే "మానాయన్నకు ఈ కేసుకు ఏమిసంబంధం?" అని ఉల్లాసవాలువేసినాడు. "సర్కారుయఅధికారి తనవిధి నెరవేర్చుటలో అడ్డంకులు కలిగించుట" అనునట్టి పీనల్ సూత్రమొకటి అతనిపై తగిలించి విచారణ చేయుచున్నారు.

## భారత దేశ నౌకాదళము

భారతనౌకాదళ సేనాని ప్రకటన

బొంబాయి, జూలై ౨.

"ఇండియా దేశములోకూడ నౌకాదళము ఏర్పడినదిగాని ఇదిచాలచిన్నది. ఇండియాలో అన్ని రేవులలోను వడిసముద్రములోనుకూడ దేశరక్షణార్థము భారత యుద్ధ నౌకలు కాపలాకాయుచుండవలెను. ఇదిమిక్కిలి అవసరము. బ్రిటిషు ప్రభుత్వమువారి నౌకాదళమువారీయుద్ధములో మిక్కిలి గొప్పసేవ చేయుచున్నారు గాని దీనినిగురించి చాలమందికి బొత్తిగా తెలియదు. శత్రువుల యుద్ధనావలు ఇండియా సముద్రములోనికి యిప్పటివరకు రాకపోవుటకికే ముఖ్యకారణము. బ్రిటిషునౌకలు వీటిని రానీయలేదు. బ్రిటిషు నౌకలు నిరోధింపును. శత్రువుల నౌకలు కొన్ని తప్పించుకొని వచ్చుచునేవున్నవి. అవి న్యూజీలెండువద్ద మందుగనులను వేసినవి, ఎఱ్ఱసముద్రములోకూడా శత్రునౌకలువచ్చినవి. ఇండియా ప్రభుత్వమువారి "పఠాను"అను యుద్ధనౌకను ఇండియాకు చేరువగానున్న ప్రదేశములోనే ఒకశత్రునౌక ముంచినది. ఇంగ్లాండులో ౧౦౦కి౫౦మంది సముద్రానికి ౫౦మైళ్ల దూరములో నివసించుచున్నారు. కాని వీరిలో మిక్కిలి హెచ్చుమందికి నౌకాదళమునుగురించి ఏమియు తెలియదు. అందుచే భారతీయులకు దీనినిగురించి తెలియకపోవుటలో యేమిఆశ్చర్యమున్నది?

ఇండియాకూడ ఒకద్వీపమే. ఉత్తరమున హిమవత్పర్వతములున్నవి గనుక వాటిమీదుగా వర్తకవ్యాపారములు జరుగవీలులేదు. గనుకసముద్రముమీదుగానే వ్యాపారమంతయు జరుగవలెను. ఇప్పుడు సముద్రముమీదుగా ప్రతి ఏట యిండియానుంచి ౬౦౦కోట్ల రూపాయిలఖరీదు (అనగా ౪౫౦,౦౦౦,౦౦౦ పౌనులు)గల వ్యాపారము జరుగుచున్నది. ఈ వ్యాపారమునకు నౌకాదళముయొక్క రక్షణ ముఖ్యముగానుండవలెను. ఇండియాలో ప్రజలసౌఖ్యము మాత్రము దీనిమీదనే ఆధారపడివున్నది. ఈ వ్యాపారము జరుగకుండ శత్రునౌకలు నిరోధించుటలో కోటీశ్వరుడైనవర్తకునకును నిరుపేదయైన రైతునకుకూడ గొప్ప నష్టము కలుగును.

ఇండియాలో సముద్రతీరము యొక్క పొడుగు మూడువైపులను మొత్తము ౫౦౦౦మైళ్ళు ఈ రేవులన్నిటిని వర్తక నౌకలను కాపాడుటకు నౌకాదళము ముఖ్యముగావుండవలెను. రాయల్ ఇండియను నేవీకిచెందిన ౫నౌకలు వర్తక నౌకల నిప్పుడు కాపాడుచున్నవి. మననౌకలు మనరేవులను. హార్బరులను కాపాడుచున్నవి. భారతదేశానికి ప్రత్యేకముగా నౌకాదళ ముండవలెనని అమెరికాదేశీయుడైన అడ్మిరలు మహానుగారే మొదట తెలియజేసిరి. ఇండియాలో నౌకానిర్మాణముకూడ జరుగవలెను నౌకా నిర్మాణములో భారతీయులు అధికమైనఖ్యాతిని వెనుకపొం... ..."అని రాయలు ఇండియను నేవీ క... ... ఆఫీసరు అడ్మిరలుఫిట్జు హెర్బర్టుగారు రేడియోద్వారా ఒక ప్రకటనచేసిరి.



## రుమేనియాలో జర్మనీ అనుకూలప్రభుత్వము

### హంగరీ, బల్గేరియాలుకూడ ఇదేపక్షము చేరుట

౨జూను ౩౦వ తేదినుండి జూలై ౬వ తేదివరకు వచ్చినవార్తలలో మరియొక ముఖ్య విషయము. రుమేనియాలో ఇంతవరకున్న ప్రభుత్వము జూలై ౪వ తేదినాటికి రాజీనామానిచ్చి జర్మనీ ఇటలీలకు అనుకూలము, యూదులతెగవారికి ప్రతికూలము అగు ప్రభుత్వమేర్పడినది. ఈ ప్రభుత్వము యుద్ధములో తటస్థముగా నుండుటగాని ఇటలీ జర్మనీలకు తోడ్పడుచుండునని వారి విధానము ప్రకటించబడినది. యూదులందరును రష్యావారికి చేరిన బెసరేబియాలోకి చేరుచున్నారు ౨౦౦ మంది బ్రిటిషుప్రజలను రుమేనియానుండి వెడలగొట్టుట కాజ్ఞయైనది.

ఇట్లుండ బల్గేరియా, హంగరీలుకూడ ఇటలీ జర్మనీల కనుకూలమగు విధాన మవలంబించుటకు తీర్మానించుకొన్నవి. బల్గేరియా విచ్ఛేదముకాకుండ కాపాడెదమనీ ఇంగ్లీషువారును ఫ్రెంచివారును ఇచ్చియుండిన అభయప్రధానమును వదులుకొనుటకు బల్గేరియా ప్రభుత్వమువారు నిశ్చయించుకొనినారు.

కాని చిత్రమేమన హంగరీ. బల్గేరియాలు రుమేనియానుండి తమకురావలసిన ప్రదేశములను వదలుకొనరట. కాని అందుకై యుద్ధముచేయరట.

## కాంగ్రెసు కార్యసంఘ సమావేశము

ఈ జూలై ౪, ౫, ౬వ తేదులలో కాంగ్రెసు కార్యసంఘుసభలు జరిగినవి. ౪వ తేదినాడు గాంధిగారు వైస్రాయిగారితో జరిగిన సంభాషణ విషయాన్ని తెలిపిరి. దానిపైచర్చలు జరిగినవి. వైస్రాయిగారు క్రొత్తగా ఏమియుచెప్పనట్లు తెలియుచున్నది. ఈసారిసభకు మౌలవ్యాగారు కూడవచ్చి నాయకులతో చర్చించుచున్నారు.

ఈలోగా సవార్కరుగారు వైస్రాయిగారితో సంభాషించినారు.

## "దారుల్ ముతాలా ఇస్లామియా"

కరీంనగరులో ఉస్మానియాపబ్లిక్ లైబ్రరీ అనునదొకటి స్థాపితమైయున్నది. దీనికి లోకల్ ఫండునుండి సహాయము సక్రమముగా దొరకుచున్నది. దీనివ్యయమంతయు పైవాపైనాగూడ లోకల్ ఫండే భరించుచున్నది. బంగ్లా సర్కారుదే కాని బాధ్యులగువారి శ్రద్ధ తక్కువగుటచేత అది ఉన్నాఒకటే లేకున్నాఒకటే. దానికి కేవలము మదీనా, పయాం, రహబర్ దక్కను పత్రికలుమాత్రమే తెప్పింపబడుచున్నవి. ఈలోపాలనుగమనించి ముఖ్యముగా ముస్లింసంఘమువారు కొందరు ముస్లింవ్యాపారుల సహాయముతో దారుల్ముతాలా ఇస్లామియాఅనుపేర వేరొక గ్రంథాలయము స్థాపించినారు, చాలాపత్రికలు తెప్పించుచున్నారు. గ్రంథాలుగూడ సేకరించినారు. రేడియో తెప్పించనున్నారు.

(రహిబరెదక్కను)

## వైస్రాయిగారి మదరాసు ప్రయాణము

సిమ్లా, జూలై ౩

ఈజూలై నెల ౨౦వ తేదినాడు మద్రాసునగరములలోని ప్రజాభిప్రాయముతో ...కి పరదము చేసుకొనదలచి, అందుకుగాను ప్రత్యేకముగా వైస్రాయిగారు, మద్రాసు, నగరమునకు వెళ్ళదలచినట్లు తెలియుచున్నది.

## దక్షిణ అమెరికాలోని విషమపరిస్థితులు

వాషింగటను, జూలై ౪

అమెరికా నౌకాశాఖకార్యదర్శిగ నియమింపబడిన కల్నలు నాక్సుగారు ఈక్రిందిప్రకటనగావించిరి:—

అమెరికా సంరక్షణపు ఏర్పాటుల విషయమున ఎక్కువశ్రద్ధవహింపవలసి యున్నదని నా అభిప్రాయము. అమెరికా రాజ్యభాగముల నాక్రమింప ఏరాజ్యమైనను ప్రయత్నించిన, అమెరికా ప్రభుత్వము యుద్ధమునకు దిగవలసినస్థితి ఏర్పడును. ఈయుద్ధమునకు వర్సైలీసుసంధియేయగాలకారణమని నాఅభిప్రాయము. వర్షాకాలము వచ్చుసరికి ఐరోపాఖండమంతయు జర్మనునకు గురియై చెప్పరాని అర్థిక దుస్థితికి పాలగునని తోచుచున్నది. దక్షిణాఫ్రికా రాజ్యములలోని పరిస్థితులు నాజీల కుట్రలవల్ల నానాటికి విషమముగ పరిణమించుచున్నవి. దౌర్జన్యమువారాక్రమించు రాజ్యము దక్షిణ అమెరికాలో ప్రవేశించుటకు అనుకూలమగు పరిస్థితులున్నవి. ఒకవిదేశ రాజ్యము దక్షిణ అమెరికా ప్రవేశించినచో అమెరికా సంయుక్తరాష్ట్రములకు అపాయకరమగు పరిస్థితులేర్పడును.

నౌకాశాఖ స్థాయిసంఘపు ప్రకటన

అమెరికా కాంగ్రెసు నావికాశాఖ స్థాయి సంఘములుగావించి ప్రకటన పైఅభిప్రాయములనే సమర్థించినది.

## తిరువాన్కూరు స్టేట్ కాంగ్రెసు ప్రకటనల నిషేధము

తిరువాన్కూరుస్టేటుకాంగ్రెసువారు ఇంతవరకు తిరువాన్కూరులోగాని, వెలుపలగాని ప్రకటించియుండిన అన్నిప్రచురణములున్ను అక్కడవున్నను ప్రభుత్వపుసొత్తు అనుఆజ్ఞను తిరువాన్కూరురక్షణ నియమాలక్రింద తిరువాన్కూరు ప్రభుత్వమువారు గావించినారు. ఇకమీదట ఆట్టిప్రకటనలను ఈ కాంగ్రెసువారలు ఇకముందుచేసినను ఇదేవిధముగ అవిప్రభుత్వపుసొత్తేయగును.

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A. B. L.